# శ్రద్ధాంజలి

''మానవుడు తనను తాను ఎలామలచుకొంటూపోతే, అలా తయారవుతాడు'' అంటుంది అస్తిత్వవాదం. We are what we have made of ourselves. అలాగే ''మనం మన ఆలోచనల పంట'' అంటుంది ధమ్మపదం. ఒక వ్యక్తి అలా ఎందుకున్నాడు? అలా ఎందుకు తయారయ్యాడు? అంటే తనను తాను అలా మలచుకొన్నాడు గనుక, అలా ఆలోచించాడు గనుక. ఇందులో సృష్టికర్త ప్రమేయంగాని, గ్రహాల ప్రమేయంగాని ఏమీలేదు. ఈవిషయాన్ని దివంగత రవీంద్రనాథ్ గారు మనసా వాచా కర్మణా నమ్మారు. అందుకే మిసిమికి "All that we are is the product of what we have thought" అనే మకుటాన్ని పెట్టారు, ఆయన గూడ ఈ తత్వానికి సాపవాదం కారు. ఆయన తనను తాను అలా మలుచుకొన్నారు. ఆయన తన ఆలోచనల He was himself. ఆయన అనన్యుడు. సిమిని అనన్యంగా రూపుదిద్దారు. అది అంది 6 జనవరి హిందూ. అది తెలుగు మేధో ప్రపంచంలో చెరగని అగ్రస్థానాన్ని సంతరించుకొంది. భారతి స్వతంత్రులను మరపింప జేసింది. ఇందులో అతి శయోక్తి లేదు. పాఠకులకు ఈ విషయం బాగా తెలుసు.

ఈ విధంగా మిసిమిని తన అనన్యసృజనాత్మకతతో తీర్చి దిద్దిన రూపశిల్పి డా॥ ఆలపాటి కాలధర్మంచేసి ఈ నెల 11వ తేదీకి సరిగా సంవత్సరం పూర్తి అవుతుంది. ఆయన లేని లోటు లోటే. ''ఒక వ్యక్తి మరణిస్తే, ఆ వ్యక్తి ఖాళీ ఏర్పడుతుంది. ''ఆ ఖాళీని ఆవ్యక్తి మాత్రమే పూరించగలడు గాని మరి ఏ ఇతర వ్యక్తి పూరించలేడు'' అంటుంది మానవవాదం. ఈ సత్యం ఇక్కడా సత్యమే.

ఒకసారి ఆయనను తలచుకొంటూ, అశ్రునయనాలతో శ్రద్ధాంజలి ఘటిస్తున్నది మిసిమి.

# మిసిమి

"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.

సంపుటి '9 ఫిబ్రవరి 1997 సంచిక 1

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ రవీంద్రనాథ్ ఆలపాటి

## విషయసూచిక



విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

ముఖచిత్రం : అలంకరణ (గులేర్)

Printed, Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.

సంపాదకుడు : అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

# కథనమే జ్ఞానమార్గం

(నోబెల్ పురస్కార స్వీకారపత్రం 7, డిసెంబరు, 1993)

మూలం: టోని మారిసన్ సంక్షిప్త అనువాదం: బి. తిరుపతిరావు.

(టోని మారిసన్ 18 ఫిబ్రవరి, 1931లో ఓహియోలో జార్జివోఫోర్డ్, రమావిలిస్‌ల రెండో సంతానంగా జన్మించింది. వారి కుటుంబం ఆఫ్రికన్ అమెరికన్ సంస్కృతిని, జానపదరీతులను, ప్రతిబింబించింది. అందుకని ఆమె చిన్న నాటినుంచే సంప్రదాయ జానపదకథలను పదాలను, హాస్యాన్ని పుణికి పుచ్చుకొంది. ఆఫ్రికన్- అమెరికన్ మౌఖిక సంప్రదాయంలో తల్లిదండ్రులు ఆమెకు పునాది వేయడమేకాక, చదువు సంధ్యల మీద, సాహిత్యం మీద మంచి అభిరుచిని కల్పించారు. ఆమె చిన్నతనంలోనే పెద్దవాళ్ళు మాత్రమే చదివి జీర్ణించుకోగలిగిన డాస్టోవిస్కీ, టాల్‌స్టాయ్, ఫ్లాబర్ట్, ఆస్టిన్‌లను ఒంటపట్టించుకొంది. 1949లో వాషింగ్‌టన్ హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో ఆంగ్లం చదివింది. ఆమె అసలు పేరు క్లోక్ (Chloc)అయితే, ఇతరులకు పలకడం ఇబ్బందిగా ఉందని, ఇప్పుడామె తన పేరును టోనిగా మార్చుకొంది.

1953లో హార్వర్డ్‌గ్రాడ్యుయేట్ పట్టాను పుచ్చుకొని, 1955లో కార్నెల్‌లో ఎమ్. ఎ. (ఇంగ్లీషు) డిగ్రీని సాధించింది. 1955 నుంచి 1957 వరకు టెక్సాల్లో బోధించింది. తరవాత హార్వర్డ్‌లో ఆంగ్ల అధ్యాపకురాలుగా చేరింది. తరవాత న్యూయార్క్, సైరక్యూజ్‌లో గ్రంథాల సంపాదకురాలుగా పనిచేసింది. 1967లో రాండమ్ హౌస్ సీనియర్ సంపాదకురాలైంది.

1970లో "The Bluest eye"అనే నవల ప్రచురించింది. 70ల్లో న్యూయార్క్ టైమ్స్‌కురాసేది. స్టేట్ యూనివర్సిటీ ఆఫ్ న్యూయార్క్ 71-72లో ఆంగ్ల సంయుక్త ఆచార్య పదవిని అలంకరించింది. "Song of Soloman" అనే నవల 1977లో, Tar Baby 1981లో, Dreaming Emmette అనే నాటకం ( ఆమెరాసింది ఒకే ఒక నాటకం) 1985లో, Beloved అనే నవల 1988లో, Jazz అనే నవల 1992లో, "Playing in the Dark:Whiteness and Literary Imagination", అనే వ్యాససంపుటిని అదే సంవత్సరం ప్రచురించింది.

1993లో నోబెల్ సాహితీ పురస్కారాన్ని అందుకొంది. స్వీడిష్ అకాడెమీ ఆమెను ఇలా అభివర్ణించింది : "ఒక అతిముఖ్యమైన అమెరికన్ వాస్తవికతా కోణాన్ని క్రాంత దర్శక శక్తి, కావ్యార్థాలతో గూడిన ప్రాణవాయువుని ఎవరు తన నవలలో నింపారో ఆమెఈమె" వీర్యం, కన్నీరు (ఆనంద, దుఃఖ ఏదైనా కావచ్చు) కర్మజలం (చెమట), రక్తం- ఈనాలుగు జీవజలాలు. సర్జకజలాలు. మనిషి సర్జకశక్తిని (elan Vital) ప్రతిఫలించేవి. వీటిని స్పృశించని రచన రచనేకాదు ఆమె దృష్టిలో. ఎందుకంటే ఇవి మానవుని హృదయకుహరం నుంచి, అంతరాంతరాళాల నుంచి ఉబికివస్తాయి. ఏ సంస్కృతికి చెందినా, ఏదేశానికి చెందినా, ఇవి అందరికీ సామాన్యమే. అందుకే ఆ రచనలు కాలాతీతాలు. వీటిని తాకని రచనలు "అంచురచనలు" మాత్రమే. ఇవి వాటిని రాయడానికి పట్టినంతకాలం గూడనిలవవు. —సంపాదకుడు)

---

★ బి. తిరుపతిరావు సుప్రసిద్ధ సాహితీ విమర్శకులు. ప్రస్తుతం సిద్ధార్థ ఆర్ట్స్ & సైన్స్ కాళాశాల, విజయవాలో ఆంగ్లశాఖలో ఉపన్యాసకులుగా పనిచేస్తున్నారు.

కథన రచనని కాలక్షేప వ్యవహారంగా నేనెప్పుడూ భావించలేదు. మనం జ్ఞానాన్ని గ్రహించటంలో అది ప్రధానమైన పద్ధతి అని నా నమ్మకం. ''అనగా అనగా ఒకసారి'' అనే వాక్యం ప్రపంచంలో అతి పురాతనమైన వాక్యం అనీ, బాల్యం నుంచి ఇప్పటి వరకూ మనకు గుర్తున్న అంశాల్లో మొదటి అంశం అని నేననుకుంటాను.

''అనగా అనగా ఒకసారి ఒక అవ్వ వుండేది, ఆమె గుడ్డిదే కాని తెలివయినది'' ముసలయ్యా కూడా కావచ్చు. బహుశా ఒక గురువు కావచ్చు లేక అల్లరి పిల్లల్ని సముదాయిస్తున్న వ్యక్తి కావచ్చు. ఈ కథని లేక సరిగ్గా ఇట్లాగే వుండేకథని నేను అనేక సంస్కృతులలో చూశాను.''

నువిన్న కథనంలో స్త్రీ అమెరికాకు చెందిన నల్లబానిసల కూతురు. ఆమె పట్టణశివార్లలో ఒంటరిగా ఓ చిన్న ఇంట్లో వుంటూవుండేది. వివేకంలో ఆమెతో సరితూగగల వాళ్ళుకానీ, ఆమెని ప్రశ్నించగల వాళ్ల గానీ ఆ దరిదాపుల్లో ఎవరూలేరు. ఆమె పరిసరాలలో చట్టమూ ఆమె దాని అతిక్రమణమూ కూడా ఆమే. ఆమె గౌరవప్రతిష్ఠలు ఆ పరిసరాల్ని దాటి గ్రామీణ జోస్యులను గేలిచేసే పట్టణాలదాకా విస్తరించింది.

ఒక రోజు ఆమెని మోసకత్తెగా భావించే కొందరు ఆమె ఇంటికి వచ్చారు. వాళ్ళ ఉద్దేశం ప్రశ్నలడగటమే అయినా; ఆప్రశ్నల్లో ఆమె గ్రుడ్డిది అని గేలిచేయటం వాళ్ళ లక్ష్యం. ఆమె ముందు నిలబడిన వాళ్ళలో ఒకడు ఇట్లా అడుగుతాడు:-

''ముసలమ్మా! నా చేతిలో ఒక పక్షివుంది. అది బ్రతికి వుందా? మరణించి వుందా? చెప్పు''. అవ్వ నుంచి సమాధానం లేదు. మళ్ళీ అదే ప్రశ్న ''నా చేతిలో పక్షి మరణించిందా, బ్రతికివుందా?''.

అయినా ఆమెనుంచి సమాధానం లేదు. ఆమె గ్రుడ్డిది. వాళ్ళ రంగు, లింగం, ప్రాంతం ఇవేమి ఆమెకు తెలియవు. అందుకే వాళ్ళప్రశ్నని ఆమె పట్టించుకోలేదు. వాళ్ళ ఉద్దేశ్యం మాత్రం ఆమెకు తెలుసు.

ఆ అవ్వ మౌనం అలాగే కొనసాగింది. అక్కడ చేరిన యువకులు మాత్రం విపరీతంగా నవ్వుతూ వున్నారు.

చివరిగా ఆమెనోరు విప్పింది. ఆమెకంఠం మృదువుగానూ, కరాఖండిగానూ వుంది. ''నాకు తెలియదు, ఆ పక్షి మరణించిందో, జీవించివుందో. నాకు తెలియదు. అయితే అది మీ చేతుల్లో వుందని మాత్రం తెలుసు, అది మీ చేతుల్లోనే వుంది''.

ఆ అవ్వ సమాధానాన్ని మనం ఇలా తీసుకోవచ్చు: ఆ పక్షి చనిపోయిన తరువాత ఆ యువకులు దాన్ని తమ చేతుల్లోకి తీసుకొని వుండాలి, లేకపోతే వాళ్ళేదాన్ని చంపివుండాలి, అది ఇంకా బ్రతికివుంటే వాళ్ళకింకా దాన్ని చంపే అవకాశం వుంది, అది సజీవంగా వుండటమో లేక పోవటమో వాళ్ళమీద ఆధారపడివుంది. అంతిమంగా ఆ బాధ్యత ఆ యువకులదే.

తమ అధికారాన్ని, ఆమె నిస్సహాయతని బహిర్గత పర్చటంలో ఆయువకులు తమ హేళనా పూరిత చర్యకి మాత్రమే కాక, అందుకోసం వాళ్ళు పణంగా పెట్టిన ఆ చిన్న పక్షి ప్రాణాలకు కూడా జవాబు దారీ అవుతారని హెచ్చరించటం ఆ అవ్వ మాటల్లో వుంది. అంటే ఆ అవ్వ ఆ యువకుల బల ప్రదర్శనా పద్ధతి మీద కాక అందుకోసం వాళ్ళు ఉపయోగించిన సాధనం (పక్షి) మీద తన దృష్టి సారించింది.

అక్కడ అసలు విషయం ఆ యువకుల చేతుల్లోవున్నపక్షి (తన సున్నిత మైన శరీరంతో పాటు) దేన్ని సంకేతిస్తుంది? అనేది నాకెప్పుడూ ఆకర్షణీయంగానే వుంటూవచ్చింది. ఒకరకంగా ఆపక్షిని నేను భాషగానూ, ఆ అవ్వను చేయితిరిగిన రచయితగానూ చూస్తాను.

తన కలలకి మాధ్యమం.అయినా భాష, తన బాల్యం నుంచీ తనతోపాటు పెరుగుతూ వచ్చిన భాషని ఎలా ఉపయోగించుకోవటం జరిగింది, ఇప్పుడు ఎలా ఉపయోగించుకొవటం జరుగుతోంది. నీచ ప్రయోజనాలకి, దుర్మార్గప్రయోజనాలకు అతీతంగా ఆ భాషని ఎలా నిలుపుకుంటూ రావటం జరిగిందీ అనే విషయాల గురించి ఆ అవ్వ ఆందోళన చెందుతూ వుంది. ఆ అవ్వ భాషని ఒక వ్యవస్థగా, వ్యక్తి నియంత్రణ క్రింద వుండే సజీవ అంశంగా చూస్తూనే, మౌలికంగా దానిని మాధ్యమంగా, నిరంతర పరిణామంలో వుండే ఒక కార్యాకలాపంగా చూస్తుంది. 'పక్షి చనిపోయిందా? జీవించి వుందా?' అని ఆ యువకులు అడిగిన ప్రశ్న అవాస్తవంకాదు, ఎందుకంటే ఆమె దృష్టిలో భాష మృత్యువుకి, తుడిచి వేతకి లోబడి అస్తిత్వంలో వుండేది. భాషని ఇచ్ఛాపూర్వకంగా మాత్రమే నాశనానికి గురిచేయటం జరుగుతుంది. ఆయువకుల చేతిలో వున్న పక్షి చచ్చిపోయినట్టయితే, దానికి కాపాలాదారులుగా వున్న వాళ్ళే అందుకు బాధ్యులు. ఆమెకి మృతభాష అంటే ఎవరూ రాయనిది, మాట్లాడనిది మాత్రమేకాదు, తన వైకల్యాన్ని తానే కీర్తించుకునే భాషకూడా మృతభాషే. చలనరహితంగా వుండేది, సెన్సార్ చేసేది, సేన్సార్‌కి గురయ్యేదికూడా వృత భాషే. ఈ వృతభాషకి కాపలాకాయటం, తన ఆధిపత్యాన్ని కొనసాగించటం, తన హద్దుమీరిన స్వేచ్ఛను ప్రదర్శించటం, ఒక రకమయిన మత్తుతో స్వానురాగాన్ని ప్రతిబింబించటం తప్ప వేరే లక్ష్యం ఏమీ వుండదు. ఎంత మృతప్రాయం అయిన భాషైనప్పటికీ అది ఏ ప్రభావాన్ని చూపకుండా వుండదు. కారణం ఆ భాష మేధస్సును ప్రక్కకి నెట్టివేస్తుంది. ఆత్మ సాక్షిని స్తంభింప చేస్తుంది, మానవశక్తిని అణిచివేయగలుగుతుంది. విచారణకి లొంగని-ఈ మృతభాష కొత్త ఆలోచనల్ని సహించటం కానీ, కొత్త భావాలకి రూపకల్పన చేయటం కాని, సహించటంకానీ, కొత్తకథనాలు విన్పించటం కానీ చేయదు. ఈ మృతభాష మౌనంతోనే ఒక రకమైన గందరగోళాన్ని సృష్టిస్తుంది.

నిర్లక్ష్యం, నిరుపయోగం, అలక్ష్యం, అగౌరవం మొదలయిన వాటివల్ల ఒక భాష మృతప్రాయం అయితే, ఆ భాషని రూపొందించిన వాళ్ళు, దాన్ని ఉపయోగించే వాళ్ళు అందరూ అందుకు బాధ్యులు అవుతారు, అని ఆ అవ్వ భావంకూడా. ఆ భాష మృతిలో వాళ్ళ పాత్రకూడా బలంగానే వుంటుంది. తన దేశంలో పిల్లలు తమ నాలుకల్ని కొరికేసుకున్నారు. మాటల్లేని సమయంలో వుండే శూన్యాన్ని, వైకల్యంతో కూడిన భాషని బుల్లెట్లతో నింపారు. ఈ స్వయం వాక్ఛేదనని పిల్లలు మాత్రమే కాదు, శైశవ లక్షణాలు కల నాయకులు, మానవ సహజతాలతో సంబంధాన్ని తెంచేసుకున్న వ్యాపారులు చేస్తున్నారు, ఎందుకంటే వాళ్ళు అణిగి వుండే వాళ్ళతోనే మాట్లాడుతారు. అణుకువతో వుండే వాళ్ళతోనే మాట్లాడుతారు.

ఒక పథకం ప్రకారం భాషని ధ్వంసం చేసే క్రమాన్ని భాషలోని సూక్ష్మమయిన, సంక్లిష్టమైన, మాధ్యమిక లక్షణాల్ని తొలగించే దాన్ని వశం చేసుకొనే ధోరణులలో చూడవచ్చు. అణిచివేతతో నిండిన భాష హింసకి ప్రాతినిధ్యం వహించటమే కాక, అది కూడా హింసాత్మకంగా వుంటుంది. జ్ఞానానికి వున్న పరిమితుల్ని గురించి అది చెప్పటమేకాక, అది స్వయంగా జ్ఞానాకి పరిమితులు విధిస్తుంది. మార్మికతతో నిండిన రాజ్యభాష అయినా, ఆలోచనా రాహిత్యపు ప్రచార సాధనాల సంకరభాష అయినా, గర్వంతో నిండిన అకాడమీల భాష అయినా, పరాయికరణతో నిండిన

మైనార్టీభాష అయినా, అది తన జాతివివక్షతా దారుణత్వాన్ని సాహిత్యరూపంలో దాచి వుంచటం వల్ల అటువంటి భాషని తప్పక తిరస్కరించాలి, మార్చాల్సి, బహిర్గతం చేయాలి. అటువంటి భాష రక్తాన్ని పీల్చే భాష, దుర్బలత్వాన్ని ఆశ్రయించే భాష, లింగవివక్షత నిండివున్నభాష, వర్గవివక్షతని సమర్థించే భాష, తన ఫాసిస్టు తత్వాన్ని దేశభక్తి మాటున దాచివుంటే భాష, ఆస్తికత్వపు భాష. ఇవన్నీ కూడా అధికార నిర్బంధ భాషలు. ఈ భాషలు కొత్తజ్ఞానాన్ని అనుమతించవు, పరస్పర భావ మార్పిడిని అంగీకరించవు.

కిరాయి మేధావి, అసంతృప్తి నిండిన నియంత, కిరాయి రాజకీయనాయకుడు వాగాడంబరుడు, వంచనా పరుడయిన పాత్రికేయుడు తనతో ఏకీభవించడని ఆ ముసలమ్మకి చాలప్రగాఢంగా తెలుసు. ప్రజల్ని సాయుధుల్ని చేస్తున్న, చేసిన, బహిరంగ ప్రదేశాల్లో, కోర్టు ఆవరణలలో, పోస్టాఫీసులలో, ఆటస్థలాలలో, పడకగదుల్లో, విశాల వీధుల్లో ఊచకోత కోస్తున్న క్రమాన్ని ప్రేరేపించే భాషవుంది; వుంటుంది. అలాగే అనవసర మరణాల్ని, సానుభూతిని కలిగించే భాషవుంది, వుంటుంది కూడా. మానభంగాల్ని, చిత్రహింసని, రాజకీయహత్యల్ని సమర్థించే డిప్లమాటిక్ భాష కూడా వుంటుంది. స్త్రీలను అవమానించే, హద్దుపద్దులు లేని అవమానకరమైన భాషకూడా వుంది, అలాగే పరిశోధన ముసుగులో దాగిన కాపలా బాషేవుంటుంది. ఇంకా చెప్పాలంటే సృజనాత్మక జీవుల్ని ఆత్మన్యూనతకి, నిస్సహాయతకి గురిచేసే భాష వుంది, వుంటుంది.

బాబెల్ టవర్ బైబిల్ కథప్రకారం మొదట్లో మనుషులంతా ఒకే భాష మాట్లాడేవారు. షినార్ భూమిలో, మానవులు స్వర్గాన్ని తాకే గోపురాన్ని నిర్మించతలపెట్టి కొంతవరకు పూర్తిచేశారు. ఆ దశలో భగవంతుడు ఆనగరాన్ని, గోపురాన్ని చూడవచ్చి, వారు ఒకటి తలిస్తే, తాను మరొకటి చేశాడు. ఆమనుషులకు ఒకరి భాష మరొకరికి తెలియకుండ చేశాడు. వారి భాషను గజిబిజి చేశాడు. ఇహ ఆగోపురం పూర్తికాలేదు. ఈ విధంగా అనేక భాషలు పుట్టాయంటారు. చిన్నపిల్లలాగా అర్థంకాకుండా పదాలను ఉచ్చరించడాన్ని ''బాబిలింగ్'' అంటారు. గురించి మనం వింటూ వస్తున్న కథ ఆటవర్ కూలిపోవటం దురదృష్టకరమని, విఫలమయిన ఆ టవర్‌కూలిపోవటానికి కారణం అందులో భాగస్వాములయిన భాషల బరువుగా భావించడం జరుగుతూ వచ్చింది. భిన్న భాషలు కాకుండా ఏకశిలా సదృశ్యంగా ఒకే భాష కనుక అందులో వున్నట్లయితే అదికూలిపోవటం జరిగివుండేది కాదనీ, తద్వారా స్వర్గాన్ని చేరుకోవటం సాధ్యమయ్యేదని భావించటం జరిగింది. అసలు ప్రశ్న ఇంతకీ ఎవరి స్వర్గాన్ని సాధించేవాళ్ళు, ఎటువంటి స్వర్గాన్ని సాధించేవాళ్ళు, అవ్వకి కూడా ఇదే ఆశ్చర్యం. బహుశ ఈ స్వర్గాన్ని సాధించే ప్రయత్నం కొంత తొందరపాటుతో కూడిన అపరిణత చర్య కావచ్చు. ఎవరూ కూడా ఇతర భాషల్ని, అభిప్రాయాల్ని, కథనాల్ని అర్థంచేసుకునే ప్రయత్నం చేయలేదు. అలా అర్థం చేసుకునే ప్రయత్నం కనుక వాళ్ళు చేసినట్లయితే స్వర్గం వాళ్ళపాదాల దగ్గర వుండి వుండేది. సంక్లిష్టం అయినప్పటికీ స్వర్గం అంతా జీవితమే, జీవితానంతర దశకాదు.

అవ్వకి తనదగ్గరకివచ్చినయువకుల్నిఉదాసీనమైనఅస్తిత్వంకోసమే భాషనిబ్రతికించుకోవాలి, అనేఅభిప్రాయంతోపంపటం ఇష్టంలేదు. భాషాశక్తిదానిని ఉపయోగించే వక్తల, పాఠకుల, రచయితల వాస్తవాధీనమైన ఊహాత్మకత మన జీవితాల్ని చిత్రించేసామర్థ్యంలో వుంటుంది. భాషబానిసతనాన్ని, జాతి విద్వేషాన్ని, యుద్ధాన్ని కేంద్రం చేసుకుని మాట్లాడు లేదు. అలా మాట్లాడాలనే తీవ్రకాంక్ష కూడా భాషకి వుండదు. బాషా తీవ్రత అనేది దాని ఔన్నత్యాన్ని చాటుకోవటంలోనే వుంటుంది.

గంభీరం, నాజూకు, స్వచ్ఛత, స్పష్టత అయినా, అక్షర రహిత రోదన, వికటాట్టహాసం, ఎన్నిక చేసిన పదం, ఉత్త నిశ్శబ్దం - ఏదయినా ఆత్మ న్యూనతకి గురికాకుంటే అటువంటి భాష అలలు అలుగా జ్ఞానంవైపే నడుస్తుంది కానీ, విధ్వంసం వైపు కాదు. విచారణాత్మకంగా వుందని నిషేధానికి గురయిన సాహిత్యం గురించి, విమర్శనాత్మకంగా వుందని, ప్రత్యమ్నాయాన్ని సూచిస్తుందనీ తక్కువ చేసి తొక్కివేయబడిన సాహిత్యం-గురించి ఎవరికి మాత్రం తెలియదు? ఆత్మవిధ్వంసక భాష చేత ఎంతమంది అవమానాలకి గురయ్యారు?

పదాల పొందిక ఉదాత్తమైందని అవ్వ అంటుంది, ఎందుకంటె అది సృజనాత్మకత నిండి వుంటుంది. అది మన విభిన్నతని చాటే అర్థాన్ని ఆవిష్కరిస్తుంది. మనం ఇతర జీవజాలం నుంచి భిన్నంగా ఎలావున్నామో తెలియజేస్తుంది.

మనం జీవిస్తాం, మరణిస్తాం, ఇదే జీవితార్థం కావచ్చు. మనం భాషని తయారు చేస్తాం. మన జీవితాలకి అదే కొలబద్దకావచ్చు.

''అనగా అనగా ఒక సారి....'' అవ్వని పిల్లలు ప్రశ్నలు అడుగుతారు. ఎవరీ పిల్లలు? ఆమె యందు నిలబడి వాళ్ళు ఏమి తెలుసుకుంటారు? ''పక్షి మీ చేతుల్లో వుంది'' అన్న అవ్వ మాటల్లో వాళ్ళు ఏమి గ్రహించారు? బహుశా వాళ్ళు అవ్వమాటల్లో ''అది నా సమస్యకాదు, నేను ముసలి దాన్ని, ఆడదాన్ని, నల్లజాతి దాన్ని, గుడ్డిదాన్ని, నాకున్న జ్ఞానంతో నేను మీకు విషయాన్ని అవగతం చేయలేను, భాష భవిష్యత్ మాత్రం మీ చేతుల్లో వుంది'' అనే దాన్ని గ్రహించివుంటారు.

వాళ్ళు తమ చేతుల్లో ఏదీ లేదు అనుకుంటూ అవ్వ ముందే నిలబడి వుంటారు. అసలు వాళ్ళు అక్కడకి చేరింది సంభాషణ చేయాలనే కోరికతోనే. ఆ సంభాషణతో అవ్వకి అంతరాయం కలిగించాలనే కోరికతోనే. పెద్దల ప్రపంచాన్ని ధిక్కరించటానికి ఆ పిల్లలకి అది ఒక సాకు మాత్రమే. తమని గురించి తాము చెప్పుకోవటానికే. తమ ముందున్న అత్యవసరమైన ప్రశ్న: '' మా చేతుల్లో వున్న పక్షి సజీవంగా వుందా? మరణించిదా?'' బహుశా ఈ ప్రశ్నకి అర్థం ''ఎవరయినా ప్రాణం అంటే ఏమిటో చెపుతారా!'' అని కావచ్చు, ''మరణం అంటే ఏమిటో చెపుతారా?'' అని కూడా కావచ్చు. ఈ ప్రశ్నలో నిజానికి మోసం, చిలిపితనం ఏదీలేదు. తెలివి గలవాళ్ళు, వయస్సు మీరిన వాళ్ళు; ఆలోచించాల్సిన ప్రశ్న. తెలివయిన వాళ్ళు, సుదీర్ఘకాలం జీవించిన వాళ్ళు, మృత్యువుతో తలపడ్డవాళ్ళు కాకపోతే ఎవరు చెపుతారు ఈ ప్రశ్నలకి సమాధానం?

అవ్వమాత్రం చెప్పదు. తన రహస్యాన్ని, తన అభిప్రాయాన్ని తనలోనే దాచుకొంటుంది. తన ఆత్మిక జ్ఞానాన్ని తన ఓంటరి తనంలోనే భద్రపర్చుకొంటుంది.

అవ్వ నోటినుంచి ఏ పదమూ బయటకిరాదు. అవ్వ మౌనం చాలా లోతయినది. అవ్వమాట్లాడిన మాటల అర్థాలకంటె లోతయినది ఆమె మౌనం. ఆ మౌనం వణుకు పుట్టిస్తుంది. ఆ మౌనాన్ని అప్పుడే కల్పించుకొన్న భాషతో పిల్లలు నింపుతారు.

''మాటలు లేవా? వైఫల్యాలలోంచి బయట పడటానికి నీ వివరణగా నువ్వు మాకు ఇవ్వగలిగిన పదాలు ఏమీ లేవా? నువ్వు ఇప్పుడు మాకు నేర్పినపాఠంపాఠంకాదు. ఎందుకంటె మా దృష్టింతా నువ్వేం చేస్తున్నావ్, ఏం చూపుతున్నావు? అనే వాటిమీదే కేంద్రీకరించివుంది. దయకి, విజ్ఞానానికి మధ్య నువ్వు నిలిపిన అడ్డుగోడమీదే మా సమస్త దృష్టి.'' అంటారు పిల్లలు అవ్వతో.

''నిజానికి మాచేతుల్లో చచ్చింది కానీ, బ్రతికింది కానీ ఏ పక్షి లేదు. మాకున్నదంతా మీరు, మీ ముఖ్యమైన ప్రశ్న మాత్రమే. భాష అర్థం లేని మాయగావున్న దశ. నీ యవ్వన దశ నీకు గుర్తుకు రావాటంలేదా? నువ్వు ఉద్దేశించిన అర్థాల్ని ఆవిష్కరించిన వాక్యాలు నీకు గుర్తు లేవా? ప్రశ్నలు సమాధానాల కోసం కాంతివంతంగా మండుతూ దబాయిస్తున్న దశ మీకు గుర్తులేదా? సమాధానాలు చిక్కని స్థితిలో కోపంతో మీరు ఊగిపోయిన స్థితి మీకు గుర్తులేదా?''.

''మీరెందుకని బయటకి రారు? మెత్తని మీ వ్రేళ్ళతో మమ్మల్ని ఎందుకని స్పృశించరు? మీ దృష్టిని మళ్లించటానికి మేం చేసే ప్రయత్నాలు ఎందుకు పట్టించుకోరు? మేం యువకులం. జీవితానుభవం లేనివాళ్ళం. మాకొద్దిపాటి జీవితంలో మేమెంతో బాధ్యతాయుతంగా వుండాలని చెప్పేమాటల్ని మేం వింటూనే వుంటాం. ఈ సంక్షోభమయ ప్రపంచంలో ఏది అర్థవంతమైంది? ఒక కవిఅన్నట్టు ''దేన్ని బహిర్గతం చేయాల్సిన పని లేదు, అన్నీ నగ్నంగానే వున్నాయి.'' అవమానించటమే మా వారసత్వం అయింది. మీ లాగా మాకూ ముసలి శూన్య నేత్రాలు వుండాలని, క్రూరత్వాన్ని, సాధారణత్వాన్ని మాత్రమే చూడాలని మీరు అనుకుంటారు. మమ్మల్ని జాతీయత అనే కాల్పనికతలో మళ్ళీ మళ్ళీ దిగబడే చేతగాని వాళ్ళనుగా చూస్తారా? గతం అనే చెత్తలో, మొలలోతుల్లో మేం దిగబడివుంటే, బాధ్యత గురించి మాట్లాడటానికి మీకు ఎంత ం.'

''మీరు మమ్మల్ని, మా చేతుల్లోని పక్షిని తృణప్రాయంగా చూస్తున్నారు. మా జీవితాలకో సందర్భం లేదా? మేం బలోపేతం కావటానికి మీ అనుభవం నుండి, మీరు మాకు ఇవ్వగలిగిన ఏ సాహిత్యమూ, పాట, కవిత్వం లేదా? నువ్వు పెద్దదానివి. ముసలి దానివి, తెలివైనదానివి. నీ ముఖాన్ని కాపాడుకునే ప్రయత్నం విరమించుకో. మా జీవితాల గురించి ఆలోచించు, వేరుపడ్డ ప్రపంచం గురించి మాకు తెలియజెప్పు, ఓ కథ చెప్పు, కథనం విప్లవకరమైనది; నువ్వు అవగతం చేసుకున్నది నువ్వ తిక్రమించినా మేం నిన్ను నిందించం. వెలుగు నీడల్లో ఈ ప్రపంచం నిన్ను ఎట్లా చూపిందో మాకు చెప్పు. దేన్ని నమ్మాలో, దేన్ని చూసి భయపడాలో చెప్పవద్దు. ముసలిదానివైన నువ్వు, అంధత్వాన్ని వరంగా పొందిన నువ్వు, భాషమాత్రమే చెప్పగలిగే అంశాల్ని చెప్పే భాష నువ్వు మాట్లాడావు. భాష మాత్రమే అజ్ఞాత గాయాలనుంచి మమ్మల్ని కాపాడగలుగుతుంది.'' భాషమాత్రమే ధ్యానం''.

''స్త్రీ గా వుండటం అంటే ఏమిటో మాకు చెప్పు, తద్వారా పురుషుడుగా వుండటం అంటే ఏమిటో కూడా తెలుసుకోగలం. సరిహద్దుల్లో సంచరించటం అంటే ఏమిటో చెప్పు. నీ సాన్నిహిత్యాన్ని భరించలేని నగరం సరిహద్దుల్లో వుండటం అంటే ఏమిటో చెప్పు. బానిస సమూహాల్ని గురించి చెప్పు, రాలుతున్న మంచులాంటి సున్నితమైన ధ్వనిలో వాళ్ళు, ఆ బానిసలు, ఎలా పాడుతున్నారో చెప్పు.''

ఆ కుర్రాళ్ళు మాట్లాడటం ఆపారు. మళ్ళ నిశ్శబ్దం. ఆ నిశ్శబ్దాన్ని బద్దలు చేస్తు అవ్వ అంటుంది చివరిగా.'' ఇప్పుడు నేను మిమ్మల్ని నమ్ముతాను, మీ చేతుల్లో లేని పక్షితో నేను మిమ్మల్ని నమ్ముతాను. ఎందుకంటే మీరు నిజంగా దాన్ని పట్టుకున్నారు. చూడండి - ఇదెంత హృద్యంగా వుందో! దీన్ని మనం అందరం కలసి సాధించాం.

# విలువల పరివర్తనంలో మహాభారతం ఒక మైలురాయి

మూలం: ఐరావతీ కార్వే. అనుశీలనం: డా. ఆలపాటి రవీంద్రనాథ్

(అముద్రితరచన)

యుగం అనే పదాన్ని రెండు రకాలుగా అర్థం చేసుకోవచ్చు. ఒకటి హిందువులు అర్థం చేసుకొనే తీరులో. వీరు విశ్వకాల చక్రాన్ని నాలుగు భాగాలుగ విభజిస్తారు. వాటిని సత్య, త్రేతా, ద్వాపర, కలియుగాలంటారు. రెండో అర్థం ఆధునికార్థం. అంటే నాగరకత, సంస్కృతి, విలువలు ఆధారంగా కాలాన్ని విభజించడం. ప్రాచీన యుగమని, మధ్యయుగమని, ఆధునిక యుగమని ఆధునికులు కాలాన్ని విభజిస్తారు. ఈ వ్యాసంలో యుగం అనే పదాన్ని ఈ రెండో అర్థంలో అర్థం చేసుకోవాలి. హిందువుల నమ్మకాల ప్రకారం మహాభారత యుద్ధం ద్వాపరయుగాంతంలో జరిగినా, ఆధునికార్థంలో అది విలువల పరివర్తన దిశలో ఒక మలుపుకు శ్రీకారం చుట్టింది. ఈ మలుపునుంచి విలువలన్నీ పూర్తిగా మారిపోయాయని కాదు. విలువలు ఎప్పుడూ మారుతూనే ఉంటాయి. అయితే ఆమార్పుగణనీయమైనదని మాత్రమే అర్థం. నాటి పితృస్వామ్యవ్యవస్థ నేటి దాక కొనసాగుతున్నది. అలాగే నాటి సాహిత్య రూపాలు నేడులేవు. అంటే కొన్ని మారతాయి. కొన్ని ఇంకా ఎక్కువకాలం కొనసాగుతాయి.

మహాభారత యుద్ధం దాయాదుల మధ్య అంతస్తుకోసం, ఆస్తికోసం జరిగిన పోరు. వివిధ స్థాయిలలో ఇదే పోరు భారత దేశంలో అనేక కుటుంబాలలో కొనసాగింది. భారత దేశంలోనే కాదు దాదాపు అన్ని పితృస్వామ్యవ్యవస్థలలో ఇదే కొనసాగింది. ఈ ఇతిహాసం క్షత్రియకుటుంబానికి సంబంధించిందే అయినా, బ్రాహ్మణ కుటుంబాలు, వ్యక్తులు గూడ పాలుపంచుకొన్నారు. అయితే ఈ కథలో వైశ్యశూద్ర వర్ణాలకు ప్రాముఖ్యం లేదు. దాదాపుగ ఆ రెండు వర్ణాలు విస్మరించబడ్డాయి.

అగ్రవర్ణాలు - బ్రాహ్మణ, క్షత్రియ - రెండు ఆధిపత్యం కోసం తగవులు పడ్డాయి. అంతేకాదు అవసరాన్ని బట్టి పరస్పర సహకారాన్ని అందించుకొన్నాయి. దేవతల మెప్పుకోసం జరిపేపూజలలో, ఇంకా ఇతర జాతకకర్మకాండాది క్రతువులలో యజ్ఞయాగాదులలో క్షత్రియులు బ్రాహ్మణ సహకారాన్ని తీసుకొన్నారు. బ్రాహ్మణులకు ఇదే హాయి అనిపించింది. కొద్దిమంది బ్రాహ్మణులు మాత్రం స్వతంత్రంగానో, లేదా క్షత్రియుల పోషణలోనో అరణ్యాలలో తపస్సుచేసుకొంటూ, గురుకులాలు నడిపారు. ద్రోణుడు, పరశురాముడు లాంటి వారు క్షత్రియాధికారాన్ని ఎదిరించారు. వైశ్య శూద్రుల ప్రస్తావన భాగవద్గీతలో మాత్రం ఉంది. వైశ్యులు పశువులను మేపుకొని వ్యవసాయం; వ్యాపారంచేసుకొన్నారు. శూద్రులుపైమూడు వర్ణాలకు సేవలు చేసేవారని చెప్పింది. అయితే తరవాత కాలాల్లో ఇవన్నీ తలక్రిందులయ్యాయి. జైన బౌద్ధుల కాలంలో బ్రాహ్మణుల స్థాయి దిగజారింది. జైన, బౌద్ధమతాలకు దన్నుగా నిలిచిన వైశ్యులు జైన బౌద్ధ కథలలో నాయికా, నాయకులయ్యారు. ముఖ్యంగా జైన కథల్లో వైశ్యులు ప్రముఖస్థానాన్ని ఆక్రమించారు. ఈ నూతన ఔన్నత్యంతో వైశ్యులు కష్టంతో కూడిన వ్యవసాయాన్ని వదిలి, తేలికగా ఉండే వ్యాపారం, కుదువ వ్యాపారంచేశారు, భూస్వాములయ్యారు. శూద్రులుకాయకష్టం అవశ్యకమైన వ్యవసాయాన్ని, ఇతర చేతి వృత్తులను చేపట్టారు. మహాభారత కాలం వరకు క్షత్రియులే రాజ్యాలు యేలారు. ఆతరువాత చాలామంది ప్రఖ్యాత పాలకులు క్షత్రి యేతరులు.

కోసలను 500 నుంచి 600 వరకు ఏలిన పసేనది క్షత్రియుడుకాడు. చంద్రగుప్త మౌర్యుడు శూద్రుడు (300 బి.సి). హర్షుడు (600 ఎ.డి) వైశ్య. ఈ ప్రఖ్యాత చక్రవర్తులే కాక ఇంకా చాల మంది క్షత్రి యేతరులు రాజులయ్యారు. షుంగ, కణ్వాలాంటి బ్రాహ్మణులు రాజ్యాలు యేలారు.

మహాభారతం నాలుగు వర్ణాలను పేర్కొంది. కులాలను అంటే జాతులను మహాభారతం పేర్కొనక పోయినా అవి ఉన్నాయి. అటువంటి కులాలలో ఒకటి సూతకులం. సూతకులం చాతుర్వర్ణాలలో పేర్కొనబడకపోయినా, అది ''మొదటి రెండు వర్ణాల కంటె తక్కువదిగాను, చివరి రెండువర్ణాల కంటె పైన ఉంది,'' అని శల్యుడు చెప్పాడు. వారికి జరిపే సంస్కారాలు ఇతరులకు జరిపే సంస్కారాల కంటె భిన్నమైనవి.

మహాభారతంలో తరచుగా పేర్కొనబడ్డ మరోజాతి నాగులు. వీరి కన్యలను క్షత్రియులు వివాహమాడారు. చాతుర్వర్ణ వ్యవస్థలో వీరి స్థానం ఏమిటో ఎక్కడా పేర్కొనబడలేదు. వీరూ రాజ్యాలు యేలారుగాని, క్షత్రియులు కారు. వీరుకాక పశుపక్షుల నామాలతో వ్యవహరింపబడిన కులాలున్నాయి. (ఖాండవదహనం). దీనిని బట్టి భారతం కులసమాజాన్ని పూర్తిగా ప్రతిబింబించలేదని తేలుతుంది. క్రీస్తుశకం సమాజంలో వచ్చిన సంకీర్ణత నాటి సమాజంలో లేకపోయినా, శుద్ధవర్ణవ్యవస్థ మాత్రం లేదు.

''భార్య భర్త మాటవినాలి. అతడికి విశ్వాసపాత్రురాలై, విధేయురాలై ఉండాలి.'' ఇది భారతకాలం నాటి ఆదర్శం. ఈ ఆదర్శం తరవాతి కాలంలో స్వల్ప మార్పుకులోనైంది. ఆకాలంలో భర్తవలన సంతానం కలగకపోతే వారసులు లేకపోతే భర్త ఆదేశం పై ఆమె, ఏ ఇతర మగవానితోనైనా సంతానాన్ని కనవచ్చు. దీనిని 'నియోగం' అంటారు. దత్తతకంటె నియోగం మంచి పద్ధతి అని నాడు భావించే వారు. అసలు స్త్రీ క్షేత్రంగా పరిగణించబడింది. భర్త పనుపున, పుత్రసంతానకోసం, వారసుల కోసం, బీజాన్ని ఏ పురుషుడైనా ఆ క్షేత్రంలో నాటవచ్చు. అయితే ఈ పరిస్థితి తరవాత కాలంలో మారిపోయి దత్తత మాత్రమే అంగీకారం అయింది. నియోగం అంతరించడంతో పాటు, స్త్రీలు చేసే చిన్న చిన్న పొరపాట్లను గూడ సహించలేని స్థితి నెలకొంది. ఆనాడు, శత్రువులు జయించి ఎత్తుకుపోయి, బహుశ వాడుకొన్న స్త్రీలను, తిరిగి శత్రువును జయించి తెచ్చుకోవడం జరిగితే, వారికి యధాస్థానాన్ని కల్పించారు. స్త్రీలకు పూర్వస్థానాన్ని కట్టబెట్టడం వారి యెడ అనుకంపవల్ల కాదు. స్త్రీ పురుషుని ఆస్తిలో భాగం. ఆమెను శత్రుల బారినుండి కాపాడుకోలేక పోవడం అతనికి అవమానం. శత్రువులను జయించి తిరిగి తన స్త్రీని తెచ్చుకోవడం అతనికి గర్వకారణం. అయితే ఈ రకమైన దృక్పథం తరవాత కాలంలో పూర్తిగా మారిపోయింది. తరవాత కాలంలో పాండవులు ఎవరూ పరులు ఎత్తుకు పోయిన స్త్రీని పరిగ్రహింప నిరాకరించారు. సతీత్వానికి (పాతివ్రత్యానికి) భారత కాలంలో కంటే తరువాత కాలంలో ఎక్కువ విలువ ఇవ్వడు జరిగింది.

రావణుడు ఎత్తుకు పోయిన సీతను పరిగ్రహించడానికి రాముడు సీతకు శీల పరీక్ష పెట్టడం ఆధారంగా మనం రామాయణకాలాన్ని భారతకాలం తరవాతదిగా చెప్పవచ్చు. దీనిని సాహిత్యం తల క్రిందులుగా చెప్పిందనుకోండి.

భారతకాలంలో సామాజిక వ్యవస్థకు మూలాగ్ర పితృ స్వామ్య కుటుంబం. తండ్రిని

గౌరవించడం, సోదరుల యెడ అనుకంపతో ఉండడం. పురుషుని లక్షణమైతే, భర్తను సేవించడం పుట్టినింటి కంటె మెట్టి నింటికి పూర్తిగా గౌరవం ఇచ్చి, మెట్టి నింటిలో భాగం అయిపోవడం పిల్లలను సాకడం స్త్రీ ధర్మం.

భారతకాలం విలువలు కొంచెం సంకుచితంగానే ఉన్నాయని చెప్పాలి. ఈ సంకుచితత్వం కారణంగానే ఖాండవ దహనంలో ఉన్న ఘోర హింసను గుర్తించ లేకపోయారు. అటువంటి ఘోరాలు ఈనాడు జరగడం లేదని కాదు, కాని ఈ ప్రపంచంలో ఇప్పుడు కొన్ని సంస్థలైనా అటువంటి ఘోరకలిని ఖండిస్తున్నాయి. అప్పుడు ఎవరూ కృష్ణార్జునుల ఈ చర్యను విమర్శించలేదు. యజ్ఞయాగాదులు, జంతుబలులు ఉండే ఆ సమాజానికి అది ఘోరమనిపించి ఉండదు. బుద్ధుడు, జైనమహావీరుడు వచ్చిన తరవాతనే అది ఘోరంగా కనిపించి ఉండచ్చు.

భీష్ముడు రెండు విలువలకు ప్రాముఖ్యం ఇచ్చాడు. ఒకటి తన వంశం అవిచ్ఛిన్నంగా కొనసాగాలనుకొన్నాడు. రెండోది స్వయంగా విధించుకొన్న ఆదర్శం. ఇది చాల సంకుచితమైంది. దీనిని అతడు వదిలివేస్తే చాలబాగుండేది. అదే భీష్మ ప్రతిజ్ఞ. ఒక వ్యక్తి విలువకు సామాజిక విలువకంటె ఎక్కువ ప్రాధ్యాన్యం ఇచ్చాడు. తన కుటుంబ భావి తరాలకు హాని కలుగుతుందని తెలిసిగూడ, ఆసంకుచితత్వం నుంచి బయట పడలేక పోయాడు. భారతంలో అందరికీ నైతిక విలువలు తెలుసు. సమయం వచ్చినప్పుడు ప్రతిదానిని వ్యక్తిగతంగానే చూశారు.

భారతకాలపు దేవతలంతా వేద, పురాణదేవతలు. దేవాలయాలను భారతం ఎక్కడా పేర్కొనలేదు. దేవాయతనం అంటే దేవుని ఇల్లు. ఈ పదం ఆదిపర్వం (64,40;) భీష్మ పర్వం (108,11;) అను శాసన పర్వం (10,18) అశ్వమేధిక (69,15;) లలో పేర్కొనబడింది కాని, ఇవి తరువాతి ప్రక్షిప్తాలు. శివస్తుతి, విష్ణు సహస్రనామాలు, సూర్యుని వివిధ నామాలూ తరువాతి ప్రక్షిప్తాలే. ఈ ముగ్గురిలో సూర్యుడు ప్రముఖుడు. శివుడు ఆ తరువాత, సహస్ర నామాంకిత విష్ణువు చివరికి వస్తాడు. నైయమిక కర్మలు యజ్ఞం ఆధారంగా జరిగేవి. పవిత్రాగ్నికి నైవేద్యాలు పెడితే, దేవతలకు దూత అయిన ఈ అగ్ని, వాటిని దేవతలకు చేర్చేవాడు. ముఖ్యసమయాలలో జంతువులను బలి ఇవ్వడం ఉండేది. అయినా, తరువాతి శతాబ్దులలో ఈయజ్ఞ సంస్కారం బాగా పెరిగిపోయింది. ఇంద్ర, సూర్య, రుద్రులు ముఖ్య దేవతలు. ఇంద్రుడు ఏలే స్వర్గాన్ని నాటి ప్రజలు విశ్వసించారు. నరకం ఉందని భావించినా, అంత స్పష్టమైన భావన లేదు. మృతులకు నెలనెల శ్రాద్ధం పెట్టేవారు. కర్మ - పునర్జన్మ సిద్ధాంతం - పూర్తిగ గట్టిగ పాదుకుపోయింది. ధర్మా ధర్మాల, ఆత్మానాత్మల చర్చ భారతంలో ఉంది. తరవాత తరవాత ఈ బౌద్ధిక చర్చ అంతరించి, భక్తి మార్గం చోటు చేసుకొంది. వైష్ణవం, శైవం, బౌద్ధంల కంటె భిన్నమైన ముఖ్యమత ఆలోచన ఒకటి ఉన్నా దానికి ఒక పేరంటూ లేకపోయింది. ఆముఖ్య స్రవంతి ఎటుబడితే అటు మలచ వీలైనదిగా, ద్రవ స్థితిలో ఉండిపోయింది. ఈ ముఖ్య ఆలోచనా స్రవంతినే తరువాత విదేశీయులు హిందూవాదం (Hinduism) అన్నారు. ఇవ్వాల్టికి గూడ ఆలోచనా పరుడైన ఏ హిందువు గూడ తన మతానికి సుస్పష్టమైన నిర్వచనాన్ని ఇవ్వలేకుండా ఉన్నాడు. దానిని గురించి అతడు చెప్పేదెల్లా '' ఇది నావ్యాఖ్యానం'' అని మాత్రమే అని.

ధర్మాధర్మాలగురించి, మతస్వభావంగురించి, మానవుని భాగధేయం (destiny) గురించి భారతంలో చర్చించినంతగా బైబిల్‌లోగాని, కురాన్‌లోగాని, మరే ఇతర మతగ్రంథంలోగాని

చర్చించలేదు. అందుకనే మహాభారతం, రామాయణం కంటె గూడ, మరే ఇతర గ్రంథం కంటె గూడ మనకు దగ్గర అనిపిస్తుంది. పాశ్చాత్య సాహిత్యం మానవ జీవితం విలువ, మానవ అస్తిత్వానికి అర్థం, దురవస్థ, నిరర్థకతల గురించి పర్యాలోచిస్తుంది. ఇది మనకు, ధర్మరాజు, అర్జునుడు అనుభవించిన ''మానవవిజయంలోని శూన్యత''ను గుర్తుకు తెస్తుంది. విజయానంతరం ధర్మరాజు అంటాడు: ''ఈజయం నాకు పరాజయం అనిపిస్తున్నది''. అర్జునునికి తెలుసు తనకు విజయం తథ్యమని అయినా,'' వారునన్ను చంపినా నాకు వారిని చంపాలని లేదు. ఈ అల్పభూఖండమే కాదు స్వర్గాధిపత్యం ఇస్తానన్నా, వారిని నేను చంపను అంటాడు.

మహాభారతకాలంలో భక్తిసంప్రదాయం మొదలుకాలేదు. అర్జునుడు కృష్ణుని భక్తుడుకాదు. అతని అనుంగుస్నేహితుడు మాత్రమే.

భారతం తరువాతి యుగంలో దేవతలు, సాహిత్యం, విలువలు పూర్తిగా విభిన్నాలే. ఈ కాలంలో ఆలోచనలో తార్కిక చిక్కదనం పలుచబడినా, ''మానవాళి మొత్తాన్ని కరుణతో చూడాలి'' అనేది ప్రబలమైంది. ఇతరుల యెడ కరుణ చూపడం అంటే తనను తాను కరుణించుకోవడమే. జర్మన్ దార్శనికుడు హైడెగర్ దీనినే ఇలా అంటాడు:''. అస్తిత్వం (Dasein=being-in-the-world; tobe=sein; there=da) దాని స్వభావ రీత్యా నాశంగావింప బడగలిగినది. దాని పుట్టుకలోనే మృత్యుబీజంవుంది''. ''భవానికి (being) అభవం (non-being) అంటే భయం. తానుకారణంగా కాక, ఇతరులు కారణంగా ఈ భయం జనిస్తుంది. రోగం, ముసలితనం, మరణాలు బుద్ధుని ఈ ప్రపంచానికి విముఖుని చేశాయి. అందుకని విరాగాన్ని ప్రవచించాడు. లేకపోతే, ఈ ప్రపంచంతో ఎక్కువగా పెనవేసుకొంటే, ఎక్కువ భయం, వ్యాకులతలు కలుగుతాయి. ఈ తత్వాలన్నీ గూడ 'జాతస్యమరణం ధృవం' అన్న సత్యంమీదే ఆధారపడ్డాయి. హైడెగర్ ఇంతటితో ఆగిపోతే బుద్ధుడు, కృష్ణుడు ఇంకొంచెం ముందుకు పోయి, ''మరణించిన ప్రతిది పుట్టాల్సిందే'' నన్నారు. అయితే కృష్ణుడు చెప్పే పునర్జన్మ, బుద్ధుడు చెప్పే పునర్జన్మలు వేరువేరు. హైడెగర్‌కుమాత్రం నీకు దృశ్యమానమవుతున్న రీతిలో ఏది ఉందో అదే ఈ ప్రపంచం. భవిష్యత్‌లేదు, భూతం లేదు. అందుకని '' ఇప్పుడు'' ''ఇక్కడ'' (Now & Here) ల గురించి మాత్రమే ఆలోచించు. విలువలను గురించి మాట్లాడడంలో అర్థంలేదు. కాని మహాభారతం చెప్పిన దర్శనం అచలం, అస్ఖలితం, అస్తిత్వవాదుల దర్శనం పరాజయం, నిస్పృహలనుంచి జనించింది. మానవదురవస్థను చూసి అస్తిత్వవాదం, బౌద్ధం కన్నీరు కార్చాయి. మహాభారతం ఈ కన్నీరు కార్చలేదు.

మహాభారతంలో లేనిది, తరువాత వచ్చింది ''వీరపూజ'' (వ్యక్తిపూజ) (Heroworship). ఇది బుద్ధుని కాలం నుంచి వచ్చింది. ''బుద్ధః శరణం గచ్ఛామి, సంఘంశరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి'' ఇతరరూపాలలో ఇది నేటి సమాజంలో విస్తృతంగా ఉంది, ఈ వీరపూజ లేక వ్యక్తిపూజ భక్తి సంప్రదాయానికి పునాది. ఈ వీరుడు (దేవుడు) తనను ఈ నిరర్థక జీవితం నుంచి కడతేరుస్తాడని మనిషినమ్ముతాడు, 'నాయకుడు' 'ప్రవక్త' లను పూజించడం ఒకరూపం. రెండోది, ''దేవుని పూజిస్తే తనకోర్కెలు తీరుస్తాడు, కష్టసమయంలో ఆదుకొంటాడు'', అని భావించడం. ఇది ప్రపంచం అంతట ఉంది; ఇవేవీ మహాభారతంలో లేవు.

ఆ తరువాత, మహాభారతంలో కనిపించిన నిరాశనిస్పృహలు, కుంఠనం, నిష్ఠురత, వాస్తవికతలు, తరువాతి భారతీయ సాహిత్యంలో మనకు ఎక్కడా గోచరించవు. కొన్ని ఉదాహరణలు చూద్దాం.

కావ్యానుశాసనాన్ని, నాటకీయతను మొదటిగా నిబద్ధించిన భరతుడు ''నాటకం ఎప్పుడూ విషాదాంతం కారాదు'', అని అనుశాసించాడు. తరువాతి నాటకాలన్నీ ఈ సూత్రాన్ని తు.చ. తప్పకుండా అనుసరించాయి. మూలంలో విషాదాంతమైన రామాయణాన్నిగూడ సుఖాంతం చేయడం జరిగింది. నాయిక, నాయకులు వారి పిల్లలు చివరకు కలుసుకోవడం ఉంది. కాళిదాసు విరచిత విక్రమోర్వశీయం, శాకుంతలం ఇదే సూత్రాన్ని పాటించాయి. ప్రేమ, విరహం, పునస్సమాగమం సూత్రాన్ని అనేక నాటకాలు అనుసరించాయి.

మహాభారత శాకుంతలాన్ని, కాళిదాసు శాకుంతలంతో పోలిస్తే పై విషయాలన్నీ ద్యోతకమవుతాయి. మహాభారతంలోని రాజు, శకుంతల ఇద్దరూ ఒకరిని మించిన వారు మరొకరు. ఇద్దరూ ఇద్దరే;' జిత్తుల మారివాళ్ళు. ఎంత చిక్కించుకోవడానికి వీలైతే అంతా పొందాలను కొనేవాళ్ళు. భరతుని తీసుకొని శకుంతల రాజాస్థానానికి వెళ్తుంది. దుష్యంతుడు ఆమెను గుర్తించి గూడ, ఎరగనట్లు నటిస్తాడు. అపవాదు భయంతో అలా చేస్తాడు. అప్పుడు ఆకాశవాణి భరతుని అతని కుమారుడుగా ప్రకటిస్తుంది. వారసుడు లేని కారణాన, దుష్యంతుడు భరతుని, అతని తల్లిని సంతోషంతో పరిగ్రహిస్తాడు. ఇదొక సూటి కథ . ఇది భారత కథ ఈస్వార్థాపేక్ష, అనైతిక కథను కాళిదాసు ఒక అందమైన స్వాప్నికనాటకంగా తీర్చిదిద్దాడు. మరుపురాని అందమైన రామణీయకతతో కథను మలిచాడుగాని, మూలంలో ఉన్న తీవ్ర అసిధార పాత్ర శీలం ఇందులో రాలేదు. మూలభారతం ఆస్థాన దృశ్యంలో ఆచితూచి మాట్లాడే కేంద్రక పాత్రలు దుష్యంత శకుంతలలు పరస్పర ప్రత్యాభియోగాలు చేసుకొనే వారి వాక్చాతుర్యం, నభూతో నభవిష్యతి. కాని కాళిదాసు శకుంతల ఒట్టి అమాయిక, అడవి పిల్ల. దుష్యంతునికి శాపాన్ని అంటగట్టి, అతనిని దోషాలనుంచి ప్రక్షాళనం చేయించాడు కాళిదాసు. అందమైన రమణీయ కావ్యలక్షణం కోసం కాకపోతే, చివరి పునస్సమాగమ దృశ్యాన్ని చదవలేము.

సంప్రదాయ సాహిత్యం మృదుమధుర స్వనంతో, సంవేదనతో నిండి ఉన్నా అది భ్రమపూరితం. కాని మహాభారత సాహిత్యం సంక్షిప్తం, నిష్ఠురం, ఘనం, కర్కశమూ అయినది. అయితే ఇందులో బౌద్ధికాంశ ఉండి, ఆలోచింప జేస్తుంది.

మహాభారతం ముందరి ఐతరేయంలోని హరిశ్చంద్రునికథకు మహాభారతం అనంతర పురాణ సంబంధ హరిశ్చంద్రుని కథకు ఎంతో తేడా ఉంది. ఐతరేయంలోని హరిశ్చంద్రుడు మానవుడు. మానవస్వభావాన్ని పుణికిపుచ్చుకొన్నాడు. వరుణవరప్రసాది అయిన తన పుత్రుడు, రోహితుని వరుణునితో చేసుకొన్న ఒప్పందం ప్రకారం అతనికి బలి ఇవ్వాలి. కాని పుత్రవాత్సల్యాన్ని వీడలేక ( ఇది మానవసహజం) ఎన్నో సాకులు చెప్పి, చివరకు ఒక బ్రాహ్మణుని పుత్రుని తనకొడుకుకు బదులు బలి ఇవ్వడానికి ఏర్పాటుచేస్తాడు. ఆ బ్రాహ్మణ బాలుని నూరుగోవులను ఇచ్చి రోహితుడు కొంటాడు. అతనిని బలి ఇవ్వడానికి ఎవరూ ముందుకురారు. మరో మూడు వందల ఆవులు ఎక్కు ఇస్తే ఆపనిచేయడానికి ఆబాలుని పేద తండ్రి ముందుకు వస్తాడు. ( ఇది పేదరికపు బాధ, ధనం అంటే ఆశ ఇవీ మనుషులకుండే లక్షణాలే). చివరకు ఆ బాలుడు

వరుణుని ప్రార్థించడంతో కథసుఖాంతమవుతుంది. అయితే ఆబాలుడు అటువంటి నికృష్టపుతండ్రి వద్దకు వెళ్ళక, విశ్వామిత్రుని పెంపుడు బిడ్డఅయి, తర్వాత రుషి అవుతాడు.

కాని పురాణంలో హరిశ్చంద్రుడు, కలలో చేసిన వాగ్దానం నిలబెట్టుకోవడానికి, - (తన రాజ్యాన్ని ఒక బ్రాహ్మణుడికి ఇచ్చినట్లు కలగంటాడు. తెల్లవారు నిజంగానే ఆ బ్రాహ్మణుడు వచ్చిరాజ్యం అడుగుతాడు). తనను, భార్యను బానిసలుగా అమ్ముకొంటాడు (బ్రాహ్మణునికి అడిగిన దానికంటె ఎక్కువ ఇవ్వడం ఆచారం. అందుకని తనకున్న రాజ్యం కంటె అధికంగా ఇవ్వాల్సి వచ్చింది). రోహితుడు పాముకాటుతో మరణించినప్పుడు అతని తల్లి అతని పై బడి రోదిస్తుంది. దీనికి బ్రాహ్మణుడు కుపితుడై పిల్లల్ని తినే మారిగా మారమని శపిస్తాడు. ఆమెకు మరణ శిక్ష విధింపబడగా హరిశ్చంద్రుడు ఆమెను వధించవలసి వచ్చింది. అతను గొడ్డలి ఎత్తినప్పుడు దేవతలు అడ్డుపడతారు. ఇది క్లుప్తంగా కథ. ఇందులో మానవస్వభావలక్షణాలు ఏమీ లేవు. మొదటి హరిశ్చంద్రుడు దేవునికి కూడ తనకొడుకును ఇవ్వడానికి ఇష్టపడడు. రెండో హరిశ్చంద్రుడు కలలో చేసిన వాగ్దానాన్ని నిలుపుకోవడానికి నానా అగచాట్లు పడతాడు. ఇతడు వాగ్దానం నిలుపుకోవడం గూడ వట్టి శుష్కప్రక్రియయే. అంతా డొల్ల, మానవాతీత గుణాలు అనేక రెట్లు పెరిగి కనిపిస్తాయి.

మహాభారతంలో పాత్రలన్నీ మానవసహజమైనవి. సుఖదుఃఖాలను మానవులులాగే అనుభవించారు. మనుషులు ఏమి చేస్తారో వాళ్ళూ అదేచేశారు. తప్పుచేస్తే శిక్ష అనుభవించారు. విధి నుంచి తప్పించడం ఎవరి తరంకాదు. అలాగే వారు దుఃఖాన్ని, వినాశాన్ని, కష్టాలను సుఖం, విజయం, సంతోషాలతోపాటే అనుభవించారు. భీష్మునికి, ద్రోణునికీ ఇవి తప్పలేదు. ఆశలు, నిరాశలు, నిస్పృహలు అన్నీ మానవసహజమైనవే. మహాభారతం స్వప్న ప్రపంచాన్ని సృష్టించలేదు. అద్భుతాలు లేవు. విధిని మార్చడానికి దేవతలు అడ్డుపడలేదు. దురదృష్టం అదృష్టంగా మారలేదు. ఎవరి విధిని వారు నిర్వర్తించారు. ఒకపారితోషికం కోసం కాక, వారంతా గౌరవంగా జీవించాలనుకొన్నారు. గౌరవంగా మరణించాలనుకొన్నారు. తమకు వారసత్వంగా లభించిన విలువలను, మానవాళికి సహజమైన విలువలను, వారు పరిరక్షించాలను కొన్నారు, అలాగే చేశారు.

తరువాతియుగంలో విలువలన్నీ పూర్తిగా మారిపోయాయి. సత్యం, సాహసం, విశ్వాసం, భక్తి అన్నీ ''అతికి'' తీసుకు పోబడ్డాయి. ఈ '' అతి'' ఆదర్శాలను ప్రతిబింబించే పాత్రలను మలిచిన తీరు అపస్వరాలను పలుకుతుంది. నాయికా నాయకులు మధ్యలో పడే కష్టాలన్నీ చివరకు సుఖం పొందడానికే, వీరి కష్టాలు తాత్కాలికాలు. చివరి సుఖాల కోసమే ఈ కష్టాలు కల్పించబడతాయి. విలువలంటే గౌరవంతో కాక, సత్ప్రవర్తన తెచ్చే పారితోషికం కోసం పాత్రలు అలా ప్రవర్తిస్తాయి. సర్వంత్యాగం చేసిన హరిశ్చంద్రుడు చివరకు అంతకంటె బ్రహ్మాండమైన స్థితిలో ఉంటాడు. ఉత్తర రామచరితంలో రాముని చేత చంపబడ్డ శంబుకుడు, మునపటికంటె మంచి స్థితిలోకి వస్తాడు. సీత భూమిలోకి అంతర్థానం కావడం మాయ. ప్రతి కష్టం మంచితనానికి పరీక్ష. పరీక్ష ప్యాసైతే అంతావైభవమే. ఈ రసవిద్య (Alchemy)లో వాస్తవిక నిష్ఠుర జీవితరేఖలు పూర్తిగా అంతర్హితమై, దాని స్థానంలో స్వప్న ప్రపంచం సృజించబడుతుంది. ఆ స్వప్న ప్రపంచంలో నాయికా నాయకులు తరవాత కలకాలం సుఖంగా జీవిస్తారు. అంతటితో కథ కంచికిపోతుంది. ఈ కథే ఈనాటి సాహిత్యానికీ వర్తిస్తుంది. వాస్తవజీవితంలో ఎదురు దెబ్బలు తిని పలాయనం చిత్తగించే వారికి ఈ సాహిత్యం ఊరట కల్పిస్తుంది. దీనికి ఒక్కబౌద్ధసాహిత్యమే సాపవాదం (Exception) శంకరుని తాత్వికసాహిత్యం ఇంకా ఇతర కథలు

అటువంటివే. వీటిల్లో అందం, సౌరభం అన్నీ ఉంటాయికాని, భారతంలో ఉన్న అసిధారాప్రజ్ఞ మాత్రం ఉండదు. భక్తి సాహిత్యం మరీ అధ్వాన్నమైంది. ఎన్ని దుర్మార్గాలు చేసినా, అజామిలుడు, మరణశయ్య మీద 'నారాయణ' శబ్దం ఉచ్చరిస్తే (ఆ నారాయణ శబ్దం కూడ అతని కొడుకు పేరు) దేవ దూతలు అతనిని స్వర్గానికి తీసుకుపోతారు. గురువైన వాడు, ''నాలో మంచిని మాత్రమే అనుకరించు, చెడును వద్దు'' అని చెప్పాలని మహాభారతం చెప్తే గురువును అంత భక్తితో అనుకరించమని జ్ఞానేశ్వర్, తుకారామ్, రామదాసులు చెప్పారు. ఈ విధంగా సాహిత్యం వాస్తవానికి విడాకులిచ్చింది.

మహాభారత కాలానికి ముందరి రచనలన్నీ మౌలికాలు. అవన్నీ మంత్రాలు, కర్మకాండ, ఇంకా ఇతర కథలు. మహాభారతం గూడ మౌలిక రచనే. ఇంకా తరవాత వచ్చిన సాహిత్య మంతా వేదోపనిషత్తులకు టుప్టీక మాత్రమే. వ్యాఖ్యానం మాత్రమే. మౌలిక ఆలోచనా ధారలేదు. తరవాత వచ్చిన ధర్మానికి, పద్యానికి, కల్పనకు, విమర్శకు మూలం మహాభారతమే.

మహాభారతకాలంలో మనుషులు, దేవతలు తిన్న ఆహారం తరవాత కాలంలో వాడకంలో లేదు. నాటిప్రజలు మేషపాలకులు (పశుపాలకులు) యవలు పండించేవారు. గోవులు, గుర్రాలు వారి ఆస్తి. క్షత్రియుల ప్రతిష్ఠ తమకున్న గుర్రాల సంఖ్యమీద ఆధారపడి ఉండేది. గుర్రాలు లాగే రథాలతో యుద్ధంచేసేవారు. (రథ చక్రాలకు ఆకులు ఉండేవి.) సైనికునికి గుర్రం స్వారి తెలియదు. గుర్రపుస్వారీ క్రీస్తు శకంలో భారతదేశంలో ప్రవేశించింది. భారతకాలానికిగోమాంస భక్షణ ఉంది. కర్ణుడు శల్యుని తిట్టినప్పుడు, ''మీ మద్ర దేశంలో గోమాంసం తింటారు, మద్యం సేవిస్తారు'', అని అంటాడు. వేట ఉండేది, రాజులంతా తాగేవారు. పాలు, పెరుగు, ఘృతం యజ్ఞాలలో అర్పించేవారు. ఘృతం అంటే నెయ్యి కాక ఆవుల కొవ్వు ఇతర జంతువుల కొవ్వు గూడ ఉపయోగించారు. '' ఆజ్యం'' అజం (మేక) నుంచి నిష్పన్నమై ఉండవచ్చు. వాళ్లు ఏది తింటే అదే దేవతలకు నైవేద్యం పెట్టారు. నేడు ఆదేవతలు లేరు, ఆ ఆహార పదార్థాలు తినడమూ లేదు.

లిపి వ్యవహారానికి వస్తే నాడు లిపి లేదు. అశోకుని శాసనాలకు ముందులిపి ఉన్నదాఖలాలు లేవు. మహాభారతంగూడ లిపిని గురించి ఎక్కడా పేర్కొన లేదు. అందుకే మన మహర్షులను నిరక్షరాస్యులు అన్నాడు మాక్స్‌ములర్. అందుకే వేదాలు మౌఖికంగా ప్రసారమయ్యాయి. భారతంలో వార్తలను మౌఖికంగానే పంపారు. విదురుడు లాక్షాగృహం వ్యవహారం గురించి, ధర్మరాజుకు కబురు ఒక నమ్మకస్తునిద్వారా మౌఖిక సందేశం (మాటల కబురు) పంపుతాడు. లేఖ కాక వాచక రూపంలో పంపుతాడు. కాని తరువాతి కొంతమంది కవులు, రుక్మిణి కృష్ణునికి ప్రేమలేఖ రాసినట్లు చెప్పారు. అసలు లిపే లేనప్పుడు రుక్మిణి రాయడం, కృష్ణుడు దానిని చదవడం ఎలాసాధ్యం.

వేదాలు, ఉపనిషత్తులు, మహాభారతంలో ఆరంభమైన భారతీయ సమాజం, భారతకాలం తరవాత ఒక్కసారిగా ఎందుకు తలక్రిందులుగా పల్టీ కొట్టింది? అంతగా జీవిత వాస్తవికతలను అనుభవించి ఆలోచించిన సమాజం, అంధవీరపూజ (వ్యక్తిపూజ)కు, భక్తివాద స్వాప్నిక పలాయనాన్ని, ఎలా అంగీకరించింది? గోమాంసంతోసహా అన్ని రకాల మాంసాలు తిన్న మనుషులు నైయమికంగా గోమూత్రం, గోమయాలను ( ఆవు ఉచ్చను, ఆవు పేడను) త్రాగడం తినడం అటువంటి చతుష్పాదజంతువైన ఆవును తమ తల్లిగా అంగీకరించడంలో సంతృప్తిని ఎలా పొందుతారు? ఇవి ప్రశ్నలు. మేధావులకు మేత మాత్రమే.

# విస్మృత భారతమిత్రుడు

## సర్‌మోనియర్ - మోనియర్ విలియమ్స్ (1819-1899)

-జానమద్ది హనుమచ్ఛాస్త్రి

ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో సంస్కృత శాఖ బోడెన్ ప్రొఫెసర్‌గా పనిచేస్తూ వుండిన ప్రముఖ సంస్కృత విద్వాంసుడు హోరేస్ హేమన్ విల్సన్ 1860 మే నెల 8వ తేదీన కన్ను మూశాడు. ప్రతిష్ఠాత్మకమైన ఆస్థానానికి తగిన విద్వద్వరేణ్యుని ఎన్నుకోవటానికి విశ్వవిద్యాలయ పట్టభద్రుల సమావేశం ఏర్పాటు చేయాల్సి వచ్చింది. ఆ ఎన్నికలో 3786 మంది విద్వాంసులు పాల్గొన్నారు. ఆ పదవిలో నున్న ఆచార్యుని వార్షిక వేతనం 900 పౌండ్ల మొదలు 1000 పౌన్‌ల వరకు వుండేది. అతి విశిష్టమైన ఆపదవికి తగిన విద్యాయోగ్యతలు గలవారు కొందరు మాత్రమే వున్నా, వాస్తవంగా పోటి ఇద్దరి మధ్యనే సాగింది.

ఇద్దరిలో ఒకరు ప్రొఫెసర్ మేక్స్ ముల్లర్ అతని వయసు 36 ఏళ్ళు. పుట్టుకతో జర్మన్ దేశీయుడైన మేక్స్‌ముల్లర్, లిప్‌జిగ్ యూనివర్శిటి నుండి డాక్టరేట్ పట్టా అందుకొన్న ప్రముఖ ప్రాచ్యభాషా వేత్త, ఋగ్వేదసంహిత అనువాదకుడుగ, (సెక్రెడ్ బుక్స్ ఆఫ్‌దిఈస్ట్ గ్రంథసంపుటాలు) ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో ఐరోప్య భాషల ఆచార్యుడుగ ప్రసిద్ధుడు.

మరొక అభ్యర్థి మోనియర్ విలియమ్స్. ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ విద్యార్థి, వయసు 41 ఏళ్ళు. ఇటీవల మూతబడిన హెయిల్‌బరికాలేజ్ (సి.పి. బ్రౌన్‌చదువుకొన్న కాలేజీ) లో సంస్కృతం, హిందుస్తాని, పర్షియన్ భాషా చార్యుడు. వారిద్దరి మధ్య జరిగిన పోటి ఇంగ్లండు పార్లమెంటుకు జరిగిన ఎన్నికలకు దీటుగా సాగింది. ఎన్నిక 1860 డిసెంబర్ 7న జరుగనున్నట్లు, మేనెల 16న ప్రకటింపబడింది. ఎన్నిక తేదీకి ఆరునెలల వ్యవధి వుండేది. ఈవ్యవధిలో ఒకరి పైనొకరు దుమ్మెత్తి పోసుకోసాగారు.

అప్పటికే మేక్స్‌ముల్లర్ యూరోప్‌లోను, ఇతర దేశాల్లోను, భాషా, సాహిత్య రంగాలలో నిష్ణాతుడుగసువిఖ్యాతుడు. భారతీయతత్వశాస్త్ర వైశిష్ట్యమును, తత్వశాస్త్రముల తులనాత్మక అధ్యయనము భారతీయవాఙ్మయ చరిత్ర మున్నగు విషయములోను, భాషాశాస్త్రవిద్వాంసుడుగ, సంస్కృత భాషా చార్యుడుగ తన కృషిని గురించి ప్రచారం చేశాడు.

మోనియర్ విలియమ్స్ సంస్కృత అధ్యయన పీఠం నెలకొల్పిన లెఫ్టినెంట్ కల్నల్ బాడెన్ ఆశయాలను బహిర్గతం చేశాడు. ఈస్టిండియా కంపెనీకి చెందిన బాడెన్ సంస్కృత అధ్యయన పీఠము నెలకొల్పుటకు పాతికవేల పౌండ్లను ఇస్తూ, తన ఆశయాలను స్పష్టపరచాడు. భారతదేశంలో సంస్కృత భాషా ప్రచారం ద్వారా క్రైస్తవమత వ్యాప్తి జరగాలని భావించాడు. భారత దేశ చరిత్ర మరియు ఐరోప్య భాషల తులనాత్మక అధ్యయనం జరగాలన్నాడు. కేవలం భాషాచార్య పదవేప్రధానం కారాదు అన్నాడు. క్రైస్తవ మత ప్రచారానికి ఈ నిధి తోడ్పడాలన్న జోసఫ్ బాడెన్ ఆశయం సంకుచితమైనదే.

ఈ అంశాన్ని విలియమ్స్ వర్గీయులు తమ అభ్యర్థి ఎన్నికలో బాగా ప్రచారం చేశారు. అంతేకాక మేక్స్ ముల్లర్ జన్మతః జర్మన్ దేశీయుడని, అతని ఆంగ్లభాషా వ్యామోహం విచిత్ర మైనదని ప్రచారం చేశారు. మేక్స్ ముల్లర్ వర్గీయులు కూడా ఇట్టి వ్యక్తిగత దూషణలకు అతీతులు కారు. మోనియర్ విలియమ్స్ సంస్కృత వ్రాతప్రతిని చదువలేడని, సంస్కృత గ్రంథకర్తల గ్రంథాలను వ్యాఖ్యానించలేడని దుమ్మెత్తారు.

★ జానమద్ది హనుమచ్ఛాస్త్రి పదవీవిరమణచేసిన ఆంగ్లోపన్యాసకులు. అక్షరరశ్మి సంపాదకులు సి.పి. బ్రౌన్ మెమోరియల్ ట్రస్ట్ లైబ్రరీకి కార్యదర్శి.

ప్రచారం పతాకస్థాయికి చేరింది. సంస్కృత భాషలో మహాపండితుడుగ, భాషా శాస్త్రవేత్తగ, అధ్యాపకుడుగ పేరుగాంచిన వ్యక్తిని ఎన్నుకోవాలో లేదా సంస్కృత వ్రాతప్రతులను చదువలేని వ్యక్తిని ఎన్నుకోవాలో ఆలోచించండి అంటూ ఒక కరపత్రం వెలువరించారు.

ఇలా ఆరోపణలు, ప్రత్యారోపణలతో ఎన్నిక ఎంతో ఉత్కంఠ కల్గించింది. ఎన్నికల ఫలితం యూరప్‌లోనే కాక, ఇతర దేశాల్లోని విద్వాంసులకు కూడా సంభ్రమాశ్చర్యాలు కల్గించింది. మోనియర్ విలియమ్స్‌కు 833 ఓట్లు మేక్స్ ముల్లర్‌కు 610 ఓట్లు పడ్డాయి.

ఈ విజయం ప్రాచ్యభాషాభిమానులను అసంతృప్తికి గురిచేసింది. సంకుచితత్వంతో జరిగిన ఎన్నికగా ఈనాటికి విజ్ఞుల మనసును వేధిస్తూవుందీ ఎంపిక. మేక్స్ ముల్లర్‌బహుముఖీన ప్రతిభవిస్మరింపబడుట శోచనీయం అన్నారు.

ఇంతటి ప్రతిష్ఠాత్మకమైన ఆచార్యపీఠమును అధిరోహించుటకు మోనియర్ విలియమ్స్ విద్యాయోగత్యలను పరిగణించుట అవసరం. ఈ గౌరవానికి మోనియర్ విలియమ్స్‌తగిన వాడేనని, మేక్స్‌ముల్లర్ అతని కంటే గొప్పవాడని చెప్పుకొనకతప్పదు.

మోనియర్ విలియమ్స్ 1819లో బొంబాయిలో జన్మించాడు. అతని తండ్రి బొంబాయి ప్రాంత సర్వేయర్ జనరల్‌గా వుండేవాడు. విలియమ్స్‌లండన్‌లోని కింగ్స్ కాలేజీ స్కూల్‌లోను హెయిల్ బరీ కాలేజీలోను చదివాడు. అక్స్‌ఫర్డ్‌యూనివర్సిటి కాలేజిలో ప్రొఫెసర్ విల్సన్ వద్ద సంస్కృత అధ్యయనం చేసాడు. పట్టభద్రుడైన విలియమ్స్ హెయిల్ బరి కాలేజిలో సంస్కృత, హిందుస్తానీ పర్షియన్ భాషాధ్యాపకుడుగ పదిహేనేళ్ళు పనిచేసి, ఆకాలేజీ 1858లో మూతపడేదాక అక్కడే పనిచేశాడు.

మోనియర్ విలియమ్స్ తదేక దీక్షతో సంస్కృత సాహిత్యాధ్యయనం కావించాడు. మేక్స్ ముల్లర్ ప్రాచీనసాహిత్యాభిమాని. మోనియర్ విలియమ్స్ సంస్కృతసాహిత్యాభిమాని. విలియమ్స్ కాళిదాసురచించిన విక్రమోర్వశీయము (1849) శాకుంతలమ్ (1853) తర్వాత నలోపాఖ్యానము (1879) కృతులను విపులమైన పీఠికతో సంపాదకత్వం నెరపి ప్రచురించాడు. ఈ రచనలు పలుముద్రణలందుకొన్నాయి. విద్యార్థులకోసం, 'శాకుంతల' నాటకాన్ని సరళ వచనంలో వ్రాశాడు.

భావవ్యక్తీకరణలోను, ఛందో విశ్లేషణలోను కావ్యములకు సంబంధించినవివరణములలోను, మోనియర్ విలియమ్స్ వాటిని విశిష్టంగా వెలువరించి ప్రశంసలందుకొన్నాడు. సంస్కృతం చదువు ఇంగ్లీష్ విద్యార్థులకు, సంస్కృత నాటకాల విశుద్ధ ప్రతులను అందించాలన్న లక్ష్యంతో, సమకాలీన సంస్కృత విద్వాంసులైన కాటవేమ, శంకర; చంద్ర శేఖరుల, సంస్కృత నాటక వ్యాఖ్యలను అధ్యయనం చేశాడు. సంస్కృత నాటకరీతులను అవలోడనం చేశాడు.

విలియమ్స్ మహాభారతమందలి నలోపాఖ్యానమును రచించుటకోసం మహాభారత ప్రతలు నెన్నిటినో పరామర్శించాడు. నల చరిత్ర అనువాదం అత్యంత ప్రశంసనీయంగా సాగించాడు.

విలియమ్స్ ప్రచురించిన సంస్కృత నాటకానువాదాలు విశ్వసనీయమై, పాఠకుల నెంతగానో ఆకట్టు కొన్నాయి. పీఠికారూపంలో రచించిన సంగ్రహకథారూపాలు ఆసక్తికరంగా వున్నాయి.

సంస్కృత కావ్య, నాటకాదులు ప్రధానంగా రామాయణ, మహాభారతాంతర్గతములని ఆయారచనల విషయవైవిధ్యము రచనా రీతులు తనను ఎంతగానో మురిపించా యన్నాడు.

సంస్కృత వాఙ్మయంలో వున్నంత విషయ వైవిధ్యము, రచనారామణీయకము, ఆంగ్ల

సాహిత్యంలో మృగ్యమని ప్రస్తుతించాడు. '' ఇండియన్ విజ్‌డమ్'' (1875) అను గ్రంథంలో సంస్కృత సాహిత్యంలోని ఆణిముత్యాలను సంకలనం కావించి, సామాన్య పాఠకులకేకాక, సంస్కృత విద్యార్థులకు మహోపకారం చేశాడు. దానిని 1893లో సవరించి ప్రచురించాడు.

బాడెన్‌ప్రొఫెసర్‌పదవినిచేపట్టి, కొన్నిహిందుస్తాని మాన్యుయల్స్, హిందుస్తాని భాషాప్రవేశిక (1858) హిందుస్తానిగ్రామర్ (1862) గ్రంథాలను రచించాడు.

భారతదేశంలో మిషనరీల సేవలను ప్రోత్సహించిన మోనియర్ విలియమ్స్ భారతీయ విజ్ఞానాన్ని, మతతత్వాన్ని ప్రచారం చేయుట కోసం గ్రంథరచన చేశాడు. హిందూయిజమ్ (1877) మోడర్న్ ఇండియా అండ్ ఇండియన్స్ (1878) రెలిజియస్ లైఫ్ అండ్ థాట్ ఇన్ ఇండియా (1883) బుద్ధిజం (1889) బ్రాహ్మనిజం (1891) పేర్కొన దగినవి.

సంస్కృత భాషావ్యాకరణముల అధ్యయనంలో ఆయన నిమగ్నుడై వుండేవాడు. 1846 లోనే (అతని ఇరవైయో ఏట) సంస్కృత వ్యాకరణ గ్రంథం రచించాడు.

మోనియర్ విలియమ్స్ రచనలలో కెల్లా మకుటాయమానంగా నిలచినది అతని ' ఇంగ్లీష్ - సంస్కృత నిఘంటువు. ఆంగ్ల మాధ్యమంలో సంస్కృతం అభ్యసించే వారందరికీ అత్యంత ఉపయుక్తమైన దీ నిఘంటువు. కొన్నేళ్ళు కృషిచేసి 1851లో ఇంగ్లీష్ - సంస్కృత నిఘంటువును పూర్తిచేశాడు. మరింత విస్తృత మొనర్చిన ఈ నిఘంటువును 1899లో ద్వితీయ ముద్రణగా వెలువరించాడు. ఈ నిఘంటువులోని పదములకు ధాతు వ్యుత్పత్తులను, లక్షణయుక్తంగా ఇండో యూరోపియన్ పదాల అర్థాలతో కూర్చడం విశేషం.

ఈ నిఘంటువు సంతరించుటలో మోనియర్ విలియమ్స్ సంస్కృత - జర్మన్ నానార్థ నిఘంటు సంపుటాలు ఏడింటిని బాగా పరిశీలించాడు. ఈ బృహత్ సంపుటాలను కూర్చిన జర్మనీలోని సంస్కృత విద్వాంసులు బోట్లింగ్ మరియు రుడాల్ఫ్ రాథ్‌గార్లు వీటిని పరామర్శించినప్పటికీ, విలియమ్ తన స్వీయ ప్రణాళికను సిద్ధపరచుకొన్నాడు. భారతీయ విద్వాంసులు, మిషనరీల కొరకు సిద్ధపరచిన నిఘంటువుగా భావించినప్పటికీ, కాలక్రమంలో మోనియర్ విలియమ్స్ కూర్చిన నిఘంటువు అత్యంత ఉపయుక్తమని, ఈ నాటికీ ప్రామాణికమైనదని ధృవీకరించారు. విలియమ్స్ అందజేసిన సేవలలో మరో ప్రధాన ఘట్టం 1883లో ఆక్స్‌ఫర్డ్‌లో ఇండియన్ ఇన్‌స్టిట్యూట్‌ను నెలకొల్పటం. భారతీయ సాహిత్యం, సంస్కృతిని గురించిన విశేషాలను సాధికారంగా అధ్యయనం చేయుటకు ఈ సంస్థ కేంద్రంగా వుంటుందని ఇంగ్లాండు - ఇండియాల మధ్య సద్భావ సౌజన్యాలను పెంపొందించగలదని భావించాడు. ఈ సత్కార్య సాధనలో భాగంగా మోనియర్ విలియం 1875, 1876, 1883 సంవత్సరాల్లో మూడు పర్యాయాలు మనదేశాన్ని సందర్శించాడు. సంస్థానాధిపతులను కలుసుకొని వారి సహాయంతో 34000 పౌండ్లు పైకం సంపాదించాడు. తాను నెలకొల్పిన ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ సంస్థకు తాను సేకరించిన ప్రాచ్య భాషా సాహిత్య గ్రంథాలను, వ్రాతప్రతులను, మూడువేలకు పైగా దానం చేశాడు.

'ఇండియన్ ఇన్‌స్టిట్యూట్' ద్వారా ప్రాచ్యభాషా పండితులకు ఫెలోషిప్‌లు ప్రయాణ ఫెలోషిప్‌లు ఆక్స్‌ఫర్డ్‌లో చదువు విద్యార్థులకు విద్యార్థి వేతనాలు, ఉపన్యాసాలు, భారతీయ విషయాలపై వ్యాసరచనా పోటీలకు, ఇండో - బ్రిటిష్ సంబంధాల పటిష్టతకు గట్టి పునాదులు వేశాడు. ఆ సంస్థ శంకుస్థాపనా ఫలకంపై సంస్కృతంలో కింది వాక్యాలను ఉద్ధరించుట విశేషం.

''ఈ శాను కంపాయ నిత్యమ్ అర్య విద్యామహీయతామ్
ఆర్యావర్త - ఆంగ్ల భూయోశ్చిమతో మైత్రి వివర్ధ తామ్''

(భగవంతుని కృపవల్ల ఇక్కడ భారతీయ అధ్యయనం సదా ప్రవర్ధమానముగుగాక. తత్ఫలితంగా భారత - ఇంగ్లండుల మధ్య పరస్పర మైత్రీ భావం పెంపొందుగాక)

ఏడు దశాబ్దాల తర్వాత ' ఇండియన్ ఇన్స్టిట్యూట్'ను ఆక్స్‌ఫర్డ్ విద్యాలయ పాలనా కార్యాలయంగా మార్చారు. భారతీయ విభాగాన్ని మరోచోటికి తరలించి, అక్కడ ప్రాచ్య భాషాధ్యయన విభాగం నెలకొల్పాలని నిర్ణయించారు. ప్రస్తుతం ఈ సంస్థ అధ్యయన శాఖ ఏరూపు దాల్చిందో తెలియకున్నది.

ఈ మార్పుకు ఇదివరలో బాడెన్ ప్రొఫెసర్‌గా పనిచేసిన ప్రముఖ సాహిత్యాచార్యుని ప్రతిఘటన నిష్ప్రయోజకమైంది. ప్రొఫెసర్ బరొ ఈ సంస్థ ( ఇండియన్ ఇన్‌స్టిట్యూట్)కు పట్టిన దుర్గతికి చింతిస్తూ విషాదగీతిక రచించాడు. ఆగీతిక చివరి రెండు పంక్తులు.

'విద్యావిహీనా శాలైష పరైర్నేతా పరాభవమ్'

అయోధ్యా ప్రేషతే రామే నష్ట శ్రీ రివ శోచతి'

ఈ దుష్పరిణామానికి మోనియర్ విలియం ఆత్మ ఎంతగా పరితపించిందో!

మోనియర్ విలియమ్‌ను పలు విశ్వవిద్యాలయాలు, సంస్థలు ఘనంగా సత్కరించాయి. ఆక్స్‌ఫర్డ్ విశ్వ విద్యాలయం డి.సి. ఎల్. గౌరవ పట్టమును, కలకత్తా విశ్వవిద్యాలయం ఎల్. ఎల్.డి. పట్టమును, గొట్టింజెన్ యూనివర్శిటి గౌరవ సభ్యత్వమును ఇచ్చి సత్కరించాయి. ఇంగ్లండు విలియమ్స్‌ను 'సర్' గౌరవ బిరుదంతో భూషించింది. విలియం వైదుష్యానికి విశిష్ట సూచనగా అతనిని 'సర్‌మోనియర్ - మోనియర్ విలియమ్స్ అని ప్రస్తుతించారు. మోనియర్ విలియమ్స్ 80 సంవత్సరాలు నిర్విరామ భాషాజీవిగ భారత - ఇంగ్లండుల స్నేహ వారధిగ శ్రమించి 1899లో కన్నుమూశాడు.

మేక్స్‌ముల్లర్ భారతదేశం పట్ల, ప్రపంచం పట్ల అత్యంత గౌరవ భావం కలిగివుండగా, మోనియర్ విలియమ్స్ ఇంగ్లండు ఇండియాల మధ్య సద్భావ సాధనకు అవిరళమైన కృషిచేశాడు.

మేక్స్ ముల్లర్ వసుధైక కుటుంబమును ఆకాంక్షించగా, మోనియర్ విలియమ్స్ అచ్చమైన ఆంగ్లేయుడుగ వర్తించాడు.

ఇరువురూ భారత మిత్రులలో అగ్రగణ్యులు. భారత దేశాన్ని మనసారా ప్రేమించిన ఉదార హృదయులు, చిరస్మరణీయులు .సర్ మోనియర్ విలియమ్స్ కూర్చిన సంస్కృత - ఆంగ్ల నిఘంటువు పీఠికలోని కింది వాక్యాలు అతని సహృదయ సద్భావాలకు సాక్ష్యంగా వున్నాయి.

"…. I met to my surprise with learned and thoughtful natives - not only in the cities and towns, but even in remote villages - able and willing to converse with me in sanskrit, as well as in their own vernaculas and to explain difficult points in their languages, literatures, religions and philosophies."

అంటూ భారతీయుల ప్రతిభను కొనియాడాడు.

( ఈ వ్యాసరచనకు దిహెరిటేజ్ - జనవరి 1986 సంచికలోని, ప్రముఖ రచయిత డా॥ డి. ఆంజనేయులు గారి వ్యాసం ఆధారం. సర్. మోనియర్ విలియమ్స్ చిత్రం కూడా ఆ సంచిక లోనిదే.)

# కణాలు, తరంగాలు, క్వాంటమ్‌లు - 2

– చాగంటి కృష్ణకుమారి

1900 సంవత్సరం డిశంబరు 17న ప్లాంక్ తన క్వాంటమ్ సిద్ధాంతాన్ని ''బెర్లిన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్'' ముందుంచేడు. తన సిద్ధాంతంలో వేడిగానున్న వస్తువునుండి ప్రసారమయ్యే వికిరణ శక్తి వివిధ తరంగ దైర్ఘ్యాలలో వితరితమైన పద్ధతిని వివరించేడు. నియమితమైన వివిక్త మొత్తాలలో శక్తి ఉద్గారమవటంకానీ, శోషణమవటంకానీ అవుతుందని ప్రతిపాదించాడు. ''ఎంత?'' అనే పదానికి లాటిన్ మాట ''క్వాంటమ్'' కనుక విడివిడి మొత్తాలలో శక్తిని శక్తి క్వాంటమ్ (శక్తి గుళిక) లేదా 'క్వాంటమ్', (గుళిక) అని ప్లాంక్ అన్నాడు. చర్యాక్వాంటమ్ (చర్యాగుళిక, క్వాంటమ్ ఏక్షన్), శక్తీ క్వాంటీ కరణం (శక్తి గుళికీకరణం) అనే పదాలను వాడుతూ, ఉష్ణ వికిరణ స్వభావాన్ని వివరించేడు.

ఈ ప్రతిపాదనలు సాంప్రదాయాన్ని ఎదిరిస్తున్నవే అయినప్పటికీ, వాటిని త్రోసిపారేయడానికి కూడా ఆ నాటి శాస్త్రజ్ఞులకు వీలు లేకుండా పోయింది. ఎందుచేతనంటే అతి దీర్ఘ తరంగ దైర్ఘ్యాలదగ్గరా, అధిక ఉష్ణోగ్రతల దగ్గరా, శక్తి వితరణ నియమానికి క్వాంటమ్ సిద్ధాంతము అనుగుణంగానే ఉంది. సాంప్రదాయ యోచనలు సఫలమవుతున్న సందర్భాలన్నింటిలోనూ, సాంప్రదాయ సిద్ధాంతాలకీ ప్లాంక్ సిద్ధాంతానికీ పొత్తు ఉంది. దీన్ని బట్టి సాంప్రదాయ సిద్ధాంతాలు వివరించగలుగుతున్న సందర్భాలన్నీ వికిరణపు క్వాంటమ్ స్వభావాన్ని ఉపేక్షింప దగిన ప్రత్యేక సంధర్భాలేనని తెలుస్తోంది.

అయినా, విప్లవాత్మకమైన ప్లాంక్ '' ఊహ్ క్వాంటమ్''ను అందుకోవడం అంత తేలిక ఏమీ కాదు. అది వికిరణపు కణ, తరంగ, స్వభావాలను సమన్వయపరచగలిగే ఊహ! వికిరణాన్ని అంతరాళంలో వ్యాపించే తరంగంగానూ, అంతరాళంలో బిందు స్థానంలో ఉండే కణంగానూ భావించడం ఆనాటి శాస్త్రజ్ఞులకు కష్టసాధ్యమే అయింది. అటువంటి ఆ ఊహని అందుకోవడం ఐన్‌స్టైన్ కి సాధ్యమైంది.

క్వాంటమ్ సిద్ధాంతాన్ని అన్వయిస్తూ, ఫోటో విద్యుత్ ప్రభావాన్ని వివరించే ఐన్‌స్టైన్ వ్యాసాన్ని 1905లో ఒక జర్మన్ పత్రిక ప్రచురించింది.

ఫోటో విద్యుత్ ప్రభావము కొత్తదేమీ కాదు. ప్రయోగశాలలో విద్యుదయస్కాంత తరంగాలను సృజించి, 1887లో కాంతి తరంగ సిద్ధాంతానికి విజయాన్ని చేకూర్చి, న్యూటన్ కణ సిద్ధాంతాన్ని పూర్తిగా మరుగు పరచగలిగిన, ఆ ప్రయోగంలోనే సునిశిత పరిశోధకుడైన హెర్ట్జ్(Hertz) తన మరో పరిశీలనను కూడా నమోదు చేసి ఉంచాడు. ''విస్ఫులింగము ఏర్పడే ప్రదేశంలో అతినీలలోహిత కాంతి పతనమైనపుడు విస్ఫులింగము అత్యంత సులభంగా ఏర్పడుతుంది'' అని హెర్ట్జ్ పరిశీలన! కాంతి విద్యుత్ ప్రభావము గురించి మొట్టమొదట నమోదు అయిన పరిశీలన ఇదే! ఆధునికంగా ఈ రోజున టి.వి.కెమేరా నుండి నారింజ పళ్లను వర్గీకరించటం వరకూ, దొంగలను పట్టే అలారమ్‌ల నుండి, తలుపులను తెరిచే స్వయం చాలక సాధనాల వరకూ నిత్య జీవితంలో ఈ ప్రభావానికి ఉపయోగాలు ఉన్నాయ్. కాంతి తీవ్రత ఎంత ఉందో తెలుసుకునేందుకు ఫోటోగ్రాఫరు ఉపయోగించే కాంతి మీటరు ఈ ప్రభావము మీద ఆధారపడే పనిచేస్తుంది.

కాంతిని తరంగాలుగా భావిస్తే ఈ ప్రభావానికి వివరణ దొరకదు. కాంతి కణము అని కూడా భావించ గల్గిననాడే దీనికి సరియైన వివరణ దొరుకుతుంది. 1887లో Hertz పరిశీలించిన నాటి నుండీ 1905లో ఐన్‌స్టైన్ వివరణను యిచ్చే దాకా ఎవరూ ఈ చిక్కుముడిని విప్పసాహించలేదు.

---

డా॥ చాగంటి కృష్ణకుమారి, సింగరేణి కాలరీస్ మహిళా డిగ్రీ కళాశాలలో రసాయనశాస్త్ర శాఖలో రీడరుగా పనిచేస్తున్నారు.

కాంతి కిరణాలు సోడియం పొటాసియం, జింక్ వంటి లోహంపై పడినపుడు ఋణావేశిత కణాలు వెలువడుతాయ్. ఈ కణాలు ఎలక్ట్రానులే! ఇలా వెలువడుతున్న ఎలక్ట్రానుల గతిజశక్తి పతనమైన కాంతి తరంగదైర్ఘ్యంపై ఆధారపడుతున్నట్టుగా ప్రయోగ ఫలితాలు చెప్పేయ్. కానీ విద్యుద్ అయస్కాంత సిద్ధాంతం ప్రకారం యిలా వెలువడుతున్న ఎలక్ట్రాన్‌ల గతిజశక్తి కాంతి తీవ్రత పై ఆధారపడాలి! వెలువడుతున్న ఎలక్ట్రానుల సంఖ్య కాంతి తీవ్రతపై ఆధారపడి ఉందని ప్రయోగ ఫలితం అంటుంది. ఈ విధంగా మరోసారి సాంప్రదాయక సిద్ధాంతం ఓడిపోయింది! ప్రకృతి ఆ నియమాలను పాటించటం లేదు!

కాంతి పుంజంలోని శక్తి అంతటా వ్యాపించి ఉండక అందులోని ఒక బిందువు దగ్గర మాత్రమే కేంద్రీకృతమై ఉందని ఐన్‌స్టైన్ భావించేడు. కేంద్రీకృతమైన కాంతి శక్తిని ''ఫోటాన్'' అన్నాడు. ప్లాంక్ ఊహించిన శక్తి క్వాంటమ్ (శక్తిగుళిక), ఐన్‌స్టైన్ ప్రతిపాదించిన ''ఫోటాన్'' రెండూ ఒకటే! కాంతిశక్తి విషయంలా శక్తి క్వాంటమ్ (శక్తి గుళిక)నే ఫోటాన్ (కాంతి శక్తి గుళిక) అని ఐన్‌స్టైన్ అన్నాడు. ఫోటో విద్యుత్ ప్రభావం వల్ల వెలువడుతున్న ఎలక్ట్రాన్‌లను 'ఫోటో ఎలక్ట్రాన్‌లు' అన్నాడు.

కాంతిపుంజము లోహంపై పతనమైనపుడు కాంతిపుంజంలోని ''ఫోటాన్'' లోహంతో బంధితమై ఉన్న ''ఎలక్ట్రాన్''ని ఢీకకొనడంలో ఎలక్ట్రాన్ లోహం నుండి విడివడి వెలువవడుతోంది. ఫోటాన్ శక్తి విలువ hr కి సమానమని ఐన్‌స్టైన్ ప్రతిపాదించేడు. ఇక్కడ పతనకాంతి కిరణ పౌనఃపున్యం 'h' మరేదో కాదు; ప్లాంక్ సిద్ధాంతమే!

ఐన్‌స్టైన్ చెప్పిన ఈ కాంతి కణాలు న్యూటన్ సిద్ధాంతంలోని కణాలంత అస్పష్టంగా లేవు. ఫోటాన్ భావనలో కణభారము, తరంగ భావనతో వేరు చేయడానికి వీలు లేకుండా పెనవేసుకొని ఉంది.

మిల్లికన్ పోటో విద్యుత్ ప్రభావముపై ప్రయోగిక అధ్యయనాలు చేసి h విలువను లెక్కకట్టి కాంతికి గల 'ఫోటాన్ లక్షణాన్ని ధృవపరిచేడు.

ఐన్‌స్టైన్ ప్రతిపాదించిన ఫొటో విద్యుత్ ప్రభావ వివరాణాత్మక సమీకరణం ప్లాంక్ క్వాంటమ్ సిద్ధాంతాన్ని గట్టిగా బలపరిచింది. దాని అభివృద్ధికి తోడ్పడింది. ప్లాంక్‌ను సంతోషపరిచింది.

ప్లాంక్ సిద్ధాంతానికి మరింతగా బలాన్ని చేకూర్చిన ప్రభావాన్ని కాంప్టన్ 1923లో కనుగొన్నాడు. పరమాణువులచే పరిక్షిప్తపడుతున్న X- కిరణాలను ఫోటానుల పరంపరగా భావిస్తూ పరిక్షిప్త X- కిరణాల తరంగ దైర్ఘ్యంలో వచ్చిన మార్పును లెక్కకట్టేడు. ప్రయోగ విలువలు ఫోటాన్ సిద్ధాంతానికి అనుగుణంగా ఉన్నాయ్. ఇది ప్లాంక్ సిద్ధాంతానికి తిరుగులేని ఋజువు అయింది.

కాంతి అంటే ఏమిటి అనే ప్రశ్నకు ''నియమిత శక్తిగల ఫోటానుల పరంపర'' అని సమాధానాన్ని చెప్పుకోవాలి. ఫోటాను లేదా క్వాంటమ్ అంటే ఏమిటి అనే ప్రశ్నకు సమాధానం ఎవరికి వారు ఊహించి తెలుసుకోవలసిందే! ఇది సూక్ష్మ జగత్తుకు సంబంధించిన విషయం. బొమ్మలు గీసి చెప్పటం వల్లకానీ, నమూనాలను చూపించటం వల్లకానీ, క్వాంటమ్ అంటే ఏమిటో చెప్పటం సాధ్యంకాదు. విద్యార్థులు పదే పదే సూత్రాలను వల్లించటం వల్ల, గుడ్డి ఎద్దు చేలో పడ్డట్టు సమీకరణ ఉత్పాదనలను నేర్పటం వల్ల శాస్త్రీయ విషయాలు అర్థం కావు. ప్రయోగాలు చేస్తూ, సూత్రాలను చదువుతూ, సమీకరణాలను ఉత్పాదిస్తూ వాటిని సమన్వయ పరచడానికై యోచనలు చేస్తూ ఉంటే విషయం పట్టుబడుతుంది. అటువంటి యోచనలు క్రొత్త

విషయాల ఆవిష్కరణకు దారి తీస్తాయ్. విజ్ఞాన శాస్త్రాలని ముందుకు నడిపిస్తాయ్. సమాజానికి ప్రయోజనాలను చేకూరుస్తాయ్.

1917లో ఐన్‌స్టైన్-'' ఇకనా మిగిలిన జీవిత కాలాన్ని అంతటినీ ''కాంతి అంటే ఏమిటి?'' అనే ప్రశ్నకు సమాధానం పొందడానికై వెచ్చిస్తాను-'' అన్నాడు. అదే ఐన్‌స్టైన్ 1951లో క్వాంటమ్ సిద్ధాంతాన్ని గురించి మాట్లాడుతూ - ''విషయాన్ని ఎరిగి ఉన్న నేను ఏభై సంవత్సరాల నుండీ కాంతి క్వాంటమ్‌లు అంటే ఏమిటి? అని తలపోస్తూనే ఉన్నా సరియైన సమాధానానికి ఏమాత్రం చేరువ కాలేకపోయేను. ఈనాటి ప్రతీ పనికిమాలిన వ్యక్తీ తనకు క్వాంటమ్ అంటే ఏమిటో తెలుసును అనే అనుకొంటూ ఉంటాడు. కానీ అతను తనని తాను మభ్యపెట్టుకొంటున్నాడు; తెలుసును అను భ్రమలోనే ఉన్నాడు''- అన్నాడు.

వస్తు సముదాయం సూక్ష్మకణాలతో నిర్మించబడి ఉంది అనే ఊహను కొంతవరకూ సులభంగానే పట్టుకోవచ్చు. అటువంటి ఊహకి కొంత ఆధారం కంటికి కనిపిస్తుంది. కొండలు, కొండలనుండి బండరాళ్ళు, బండరాళ్లనుండి గులక రాళ్ళు, ఆపైన గులక రాళ్ళు ఇసకగా, ధూళిగా, కాలక్రమేణా ఒంద్రుమట్టిగా మారుతూ ఉండటాన్ని ప్రకృతిలో సహజంగానే గుర్తించవచ్చు. అంచేత పదార్థాల అంతఃనిర్మాణంలో ఒక సూక్ష్మ జగత్తు ఉందని తేలికగానే పూర్వీకులు భావించేరు. పదార్థాన్ని విభజిస్తూ పోతే ఆ విభజన ఎక్కడ ఆగిపోతుంది? పరమాణువు దగ్గర ఆగిపోతుంది, ఇహ ఆపై పరమాణువును విభజించడం, మరి వల్ల కాదు, అని అనుకొన్నారు. ' ఆటమ్' అనే గ్రీకు మాటకు అర్థము 'అవిభాజ్యమైనది' - అని! అంచేత అవిభాజ్యమైన పరమాణువుని ' ఆటమ్' అన్నారు. కానీ 1897లో జె. జె. థామ్సన్ ఎలక్ట్రాన్ కణాన్ని కనుకొన్నాడు. పరమాణువుకి కూడా ఒక నిర్మాణం ఉండి తీరాలన్న దానికి అది ప్రత్యక్ష సాక్ష్యం అయింది. ఆ తరువాత ప్రోటాను, న్యూట్రాను కణాలను కూడా కనుగొన్నారు. పరమాణువు ఈ ప్రాథమిక కణాలలో నిర్మితమై ఉండాలన్నది ఋజువైంది. దాంతో ' ఆటమ్' పదం అర్థాన్ని కోల్పోయింది! దాని స్థానే మరో కొత్త పదాన్ని వాడుకోవలసి వచ్చింది. అర్థవంతమైన కొత్తపదాలను ఎంపిక చేయడం కూడా కష్టమైన పనే! పాత పదాన్నే కొత్త అర్థంతో వాడుకోవడం విజ్ఞాన శాస్త్రాలకు తప్పని సరి!

1910లో రూథర్‌ఫోర్డ్ గ్రహమండల నమూనాను పరమాణు నిర్మాణానికి ప్రతిపాదించేడు. భూమి చుట్టూ తిరిగే చంద్రునిలా, లేదా సూర్యుడు చుట్టూ తిరిగే భూమిలా పరమాణువులో ధనావేశ కేంద్రకం చుట్టూ ఋణావేశిత ఎలక్ట్రాన్‌లు కక్ష్యలలో తిరుగుతూ ఉంటాయన్నాడు. పరమాణువులు స్థిరత్వాన్ని కలిగి ఉండటం, పరమాణు వర్ణపటాలు విచ్ఛిన్నంగా రేఖలను కలిగి ఉండటం అనే వాస్తవ విషయాలను ఈ నమూనాతో వివరించ సాధ్యం కాదు; ఇది సంతృప్తికరమైన నమూనా కాదు.

పరమాణువులకి స్థిరత్వం ఎలా వచ్చింది? అసలు పరమాణువులు వర్ణపటాలను ఎందుకు ఈయాలి? పదార్థాన్ని వేడిచేస్తే అది కాంతిని ఎందుకు వెలువరిస్తోంది? ఎలా వెలువరిస్తోంది? ఘన పదార్థాలను బాగా ఎక్కువ ఉష్ణోగ్రతకు వేడిచేస్తే అవి తెల్లని కాంతిని వెలువరిస్తాయ్. ఈ కాంతిని పట్టకం గుండా పంపితే బయటకు వచ్చే కిరణాలు ఏడు రంగులలో ఉంటాయ్. ఈ కిరణాలను తెరపై పడేటట్లు చేస్తే వర్ణపటం వస్తుంది. ఈ రంగులు అవిచ్ఛిన్నంగా హరివిల్లులోని ఏడు రంగులు లాగే కలసి మెలసి ఉంటాయ్. కానీ బాష్పాలూ, వాయువులూ హెచ్చు ఉష్ణోగ్రత దగ్గర ఇచ్చే కాంతిని వర్ణ విశ్లేషణ చేస్తే వచ్చే వర్ణ పటాలు విచ్ఛిన్నంగా ఉంటాయ్. వీటిలో విడివిడిగా రేఖలు పటీలు కనిపిసాయ్. ఎందువల?

విచ్ఛిన్నంగా ఉన్న ఈ వర్ణపటాలకీ పరమాణు నిర్మాణానికీ తప్పనిసరిగా సంబంధం ఉండి తీరాలన్న ఊహ 1913లో నీల్స్‌బోర్‌కి తట్టింది.

బోర్ తన పరమాణు నిర్మాణ ప్రతి పాదనలో సమీకరణ ఉత్పాదనలో ప్లాంక్ క్వాంటమ్ సిద్ధాంతాన్ని వాడుకొన్నాడు.

రూథర్ ఫోర్డ్ చెప్పినట్టుగానే పరమాణువులోని ఎలక్ట్రానులు కేంద్రకం చుట్టూ వృత్తాకార కక్ష్యలలోనే తిరుగుతున్నాయ్ అని బోర్ కూడా భావించేడు. అయితే కక్ష్యలలో తిరుగుతున్నంత కాలము ఎలక్ట్రాన్ శక్తి స్థిరంగా ఉంటుంది అన్నాడు. ఎలక్ట్రాన్ వికిరణ రూపంలో శక్తిని కోల్పోకుండా పరిభ్రమిస్తున్న కక్ష్యలను 'స్థావర కక్ష్యలు' అన్నాడు. ఈ విధంగా పరమాణువులో ఎలక్ట్రాన్‌లకు వివిక్తశక్తి స్థాయిలు ఉంటాయని భావించేడు.

వివిధ ఉత్తేజిత పద్ధతులలో (విద్యుత్ ఉత్సర్గం, ఉష్ణశక్తి శోషణం, కాంతి పతనం) క్రింది క్వాంటమ్ శక్తి స్థాయిలోని (లేదా భూస్థాయిలోని) ఎలక్ట్రాను అదనంగా శక్తిని గ్రహించడం వల్ల అది ఉత్తేజితమై, పై క్వాంటమ్ శక్తి స్థాయికి గెంతుతుంది. ఈ క్వాంటమ్ చర్యలో ఆ రెండు క్వాంట శక్తి స్థాయిల శక్తి విలువలతేడాకు సమానమైన శక్తి గల ఫోటానును (hr) ఎలక్ట్రాన్ శోషించుకొంటుంది.

ఉత్తేజిత శక్తి స్థాయినుండి (పై క్వాంటమ్‌శక్తిస్థాయి) భూశక్తి స్థాయికి (క్రింది శక్తి స్థాయికి) ఎలక్ట్రాన్ దుమికినపుడు అది ఆ రెండు శక్తి స్థాయిల శక్తి విలువకు సమానమైన శక్తిగల ఫోటానును ( hr ) ఉద్గారం చేస్తుంది.

ఈ విధంగా ఎలక్ట్రాన్ శక్తిలోని మార్పు వికిరణరూపంలో బయలుపడుతుంది. ఈ వికరణము X-కిరణము కావొచ్చు, దృగ్గోచర కాంతి కిరణములు కావొచ్చు, పరారుణ కిరణములు కావొచ్చు.

బోర్ హైడ్రోజన్ పరమాణువు వర్ణపటం లోని రేఖల పౌనఃపున్యాల విలువలను తను ప్రతిపాదించిన సమీకరణాన్ని ఉపయోగించి గణితాత్మకంగా లెక్క కట్టిచెప్పేడు. ఇలా గణించిన వర్ణపట రేఖల పౌనఃపున్యం విలువలు వర్ణపటాలనుండి ప్రయోగంలో పొందిన విలువలకు సరిపోయాయ్.

ఎలక్ట్రానులను సూక్ష్మ కణాలు అని అనుకొనేందుకు, అవి ఉన్నాయని ఒప్పుకొనేందుకూ ఎవరూ సందేహించరు. వాటిని కనుగొనటంతోనే, వాటి విద్యుదావేశాన్నీ, కణభారాన్నీ శాస్త్రజ్ఞులు లెక్కకట్టి సరిగ్గా తెలుసుకొన్నారు. ఎలక్ట్రాన్‌లను కనుగొన్నప్పుడు వాటిని ''కాధోడ్ కిరణాలు'' అన్నారు. అత్యధిక వోల్టేజ్ దగ్గర ఒక లోహకోధోడ్ నుండి కొన్ని మిలియనుల ఎలక్ట్రానులు ప్రవాహంలా వెలువడుతాయ్. ఈ ఎలక్ట్రాన్ ప్రవాహాన్నే ''కాధోడ్ కిరణాలు'' అన్నారు. ఎలక్ట్రాన్ ప్రవాహాన్ని '' ఎలక్ట్రాన్ పుంజము'' అని కూడా అంటారు. రేడియోధార్మిక పదార్థాలు ఉద్గారం చేసే B-కిరణాలు కూడా ఎలక్ట్రానుల ప్రవాహమే! వీటిని B-కణములు అన్నారు. అయితే ఎలక్ట్రాన్ కణానికి తరంగ లక్షణం ఉందనటం విశేషం. చలనంలో ఉన్న ఎలక్ట్రాన్ తరంగ లక్షణం లోనే చలిస్తుందని ప్రయోగంలో ఋజువు కావటం యింకా విశేషం.

1924 సంవత్సరం వరకూ పదార్థము సూక్ష్మకణ సముదాయమన్న భావన తప్ప వేరే భావము శాస్త్రజ్ఞులకు లేదు. 1924 డీబ్రోగ్లీ ''ద్రవ్యతరంగాలు'' ఉన్నాయనే ప్రతిపాదనను ప్రధాన విషయంగా పేర్కొంటూ తాను రాసిన ఒక సిద్ధాంత వ్యాసాన్ని 'ఫిలాసాఫికల్ మేగజైన్' లో ప్రచురించేడు.

''ద్రవ్య తరంగాలా?'' - అవి ఎలా ఉంటాయ్? ధ్వని తరంగాలూ, కాంతి తరంగాలూ ఉన్నాయన్న సంగతికి అందరూ అలవాటు పడిపోయేరు. అది మామూలు సంగతే అయిపోయింది. కానీ ద్రవ్యచలనాన్ని తరంగ చలనంగా యోచించడం విప్లవాత్మకమైన భావనాతరంగమే! డీ బ్రోగ్లీ చేసిన ఈ ప్రతిపాదనకు అతని దగ్గర ప్రయోగిక సాక్ష్యం లేదు. ''ప్రకృతి సౌష్టవ ప్రియ'' అనే విషయముపై అతనికిగల సంపూర్ణ విశ్వాసము అతని చేత ఇటువంటి ప్రతిపాదనను చేయించింది. ప్రకృతి 'పదార్థము', 'వికిరణము' అనే రెండు రూపాలలో మనకి కనిపిస్తుంది. వికిరణానికి ద్వంద స్వభావము (కణ, తరంగస్వభావము) ఉన్నప్పుడు, కణ స్వభావాన్ని వ్యక్తపరుస్తున్నా పదార్థానికి తరంగ స్వభావంకూడా ఉండి తీరాలి. ఇదే అతని ప్రతిపాదనలోని తర్కము.

1927లో డేవిసన్, గెర్మర్‌లు నికెల్‌చే పరిక్షేపణం చెందిన ఎలక్ట్రాన్‌ల వివర్తనాన్ని గుర్తించేరు. వివర్తనము తరంగము యొక్క అభిలాక్షణిక ధర్మము. డేవిసన్-గెర్మర్ ప్రయోగం డీబ్రోగ్లీ ద్రవ్యతరంగాలను బలపరిచింది.

ప్లాంక్ క్వాంటమ్ సమీకరణమైన E=hr = ; ఐన్‌స్టైన్ ద్రవ్యశక్తి తుల్యతా నియమ సమీకరణమైన E=mc2 లను రెండింటిని సమన్వయ పరచి డిబ్రోగ్లీ కదులుతున్న పదార్థ కణంతో ఉండే పదార్థ తరంగ దైర్ఘ్యానికి అనే సమీకరణాన్ని ప్రతిపాదించేడు. ఈ సమీకరణంలో hప్లాంక్ సిద్ధాంతం విలువను **6.6X10-34** జౌల్, సెకను అని మనం గుర్తు తెచ్చుకొంటే, కణద్రవ్యరాశి తక్కువ ఉన్నప్పుడే పదార్థ తరంగ దైర్ఘ్యం విలువ కనుక్కోవచ్చు. ఈ విధంగా సూక్ష్మకణమైన ఎలక్ట్రాన్ ద్రవ్యరాశి స్వల్పమే కనుక **(9.1X10-31 కి.జౌ) 100**వోల్టుల గతిజశక్తి గల ఎలక్ట్రాన్ తరంగదైర్ఘ్యం లెక్కకట్టితే **1.2X10-10** మీటర్ లేదా **1.2. A**.వస్తుంది. దీని పరిమాణము పరమాణు పరిమాణమంత ఉంది. లేదా ఘనపదార్థంలో రెండు ఆసన్న పరమాణుతలాల మధ్య ఉన్న దూరంతో సమానంగా ఉంది. ఈ విలువలు X-కిరణ తరంగ ఉంటాయి.

1928లో పలచటి లోహపు పొరలచే వివర్తనం చెందిన ఎలక్ట్రాన్ తరంగాల దైర్ఘ్యము డీ బ్రోగ్లీ గణితాత్మకంగా లెక్కకట్టిన తరంగ దైర్ఘ్యాలకు సమానంగా ఉండటాన్ని జి.పి. థామ్సన్ ప్రయోగ పూర్వకంగా ఋజువు చేసేడు.

ఆ తరువాత హైడ్రోజన్, హీలియం వంటి పరమాణువుల వల్ల కూడా వివర్తన బొమ్మలను పొందగల్గేరు. ఈ ప్రయోగాలన్నింటిలోనూ ద్రవ్య కణాలు ( ఎలక్ట్రానులు, పరమాణువులు మొదలైనవి) తరంగ స్వభావాన్ని చూపెట్టేయ్.

అయితే ద్రవ్య తరంగాలు విద్యుదయస్కాంత తరంగాల తరగతికి చెందవు. ఇవి కొత్తరకం తరంగాలు. వీటికి మరోపేరు పైలట్ తరంగాలు (pilot waves) అవి కణానికి మార్గదర్శకంగా ఉంటాయి కనుక వాటికి ఆ పేరు వచ్చింది.

ఈ విశ్వంలో ఉన్న ప్రతీ కణం గురించి పూర్తి సమాచారం తెలిసినట్లయితే భౌతిక సూత్రాలను అనువర్తింప జేసి సిద్ధాంతికంగా ఏ కణ భవిష్యత్తైనా పూర్తిగా తెలుసుకోవడం సాధ్యమేనని 1927 దాకా చెప్పగలిగే అవకాశం ఉండేది. ప్రతి కణం గురించి చెప్పగలం కాబట్టి ఈ

విశ్వమంతటి భవిష్యత్తు చెప్పవచ్చు! కానీ ఈ నిర్ధార్యతత్వాన్ని హైజన్‌బర్గ్ అనిశ్చితత్వ నియమం పటాపంచలు చేసింది. సరళంగా చెప్పాలంటే మన దగ్గర ఎంత అధిక ఆవర్ధన సామర్థ్యం (Resoeving power) గల సూపర్ సూక్ష్మ దర్శిని ఉన్నప్పటికీ ఎలక్ట్రాన్‌ను, అది స్థిరంగా ఉన్నా సరే, చూడటం సాధ్యంకాదు. ఎలక్ట్రాన్‌ను చూడాలంటే దానిపై కాంతి పడాలి! ఎలక్ట్రాన్‌పై కాంతి పడీపడటంతోటే కాంతి ఫోటాన్ ఎలక్ట్రాన్‌తో ఢీకొంటుంది. దాంతో ఎలక్ట్రాన్ పరుగుపెడుతుంది! అంచేత దాని శక్తిలో మార్పు వస్తుంది. అంటే ఎలక్ట్రాన్ ఉనికిని కనుక్కొనే ప్రయత్నంలో దాని శక్తిని మార్చివేయడం జరిగింది! ఎలక్ట్రాన్ స్థానాన్ని చలనంలో ఉన్నప్పుడు దాని వేగాన్నీ ఒకేసారి ఖచ్చితంగా కొలవడం సాధ్యంకానిపని. దీనికి కారణం పరికరాలలోపం కాదనీ ఈ కొలతలపై ప్రకృతి విధించిన పరిమితి అనీ గ్రహించాలి.

ఒక సూక్ష్మ కణం స్థానాన్ని సూచించే విలువలోని అనిశ్చితత్వం, ఆ కణ ద్రవ్యవేగాన్ని సూచించే విలువలోని అనిశ్చితత్వం ఈ రెండింటి లబ్ధము ప్లాంక్ స్థిరాంకానికి సమానమని హైసన్ బర్గ్ నిరూపించేడు! ఈ అనిశ్చతత్వ నియమం సూక్ష్మ కణాలకే వర్తిస్తుంది.

ఎలక్ట్రాన్ స్థానాన్ని, వేగాన్నీ ఒకేసారి నిర్ణయించలేము అని తెలిసేక, పరమాణువులో ఎలక్ట్రాన్ పరిభ్రమించే కక్ష్యలకు వ్యాసార్థాలను నిర్దేశించడానికి వీలు లేదు! పరమాణువులో వివిధ శక్తి స్థానాలలో ఉన్న ఎలక్ట్రాన్‌ను కనుగొనగలిగే సంభావ్యతను గురించి మాత్రమే చెప్పగలిగే అవకాశం ఉంది. అదీకాక, విడిగా ఎలక్ట్రాన్ పుంజము తరంగ స్వభావాన్ని ప్రదర్శించిందని ఋజువు అయాక, పరమాణువులో కేంద్రకం చుట్టూ తిరుగుతున్న ఎలక్ట్రాన్ చలనం కూడా తరంగ చలనమే కావాలి కదా! ఈ భావన ఎర్విన్ - ష్రడింగర్ కు 1926లో కలిగింది, హైసన్‌బర్గ్ అనిశ్చితత్వసూత్ర పర్యవసానముగా, ఎర్విన్ ష్రడింగర్‌కి కలిగిన ఈ భావనల వల్ల, 1926లో క్వాంటమ్ భౌతిక శాస్త్రంలో తరంగ యాంత్రిక శాస్త్రానికి పునాదులు ఏర్పడ్డాయ్. ప్లాంక్, బోర్, డీబ్రోగ్లీ, హైసన్ బర్గ్ ఎర్విన్ ష్రడింగర్, మాక్స్ బార్న్, డిరాక్ మొదలైన శాస్త్రజ్ఞుల కృషితో క్వాంటమ్ సంఖ్యాక శాస్త్రము, క్వాంటమ్ యాంత్రికశాస్త్రము మొదలైన భౌతిక, గణిత శాస్త్రాలు అభివృద్ధి చెందాయ్. ఈ శాస్త్రాల అభివృద్ధి మన నిత్య జీవితంలో ఆసక్తిదాయకమైన, ఉపయోగకరమైన అనువర్తనాలకు అసంఖ్యాకమైన అవకాశాలను యిచ్చింది. ఆహారపదార్థాలను నిలవ చేయటంలో, కేన్సరును వికిరణంతో నయం చేయటంలో, మొక్కల పెరుగుదలను అధ్యయనం చేయడానికై రేడియో ఐసోటోపుల వినియోగంలో, అంతరిక్ష యాత్రికులకు ప్రమాదాలనుండి రక్షణ కల్పించటంలో కేంద్రక శక్తి ఉత్పాదన, సౌరశక్తి బ్యాటరీల తయారీలో ఇలా లెక్కలేనన్ని విషయ రంగాలలో ఈ శాస్త్ర పరిజ్ఞానాల వినియోగం ఉంది.

ఇంతటి పురోగమనానికీ మూలం ప్లాంక్ క్వాంటమ్ సిద్ధాంతం. 'అతి నీలలోహిత విపత్తు' లోపడి దిక్కుతోచక, చీకటిలో శాస్త్రజ్ఞులు తడుములాడుకొంటున్న సమయంలో ప్లాంక్ తన క్వాంటమ్ దీపంతో దారి చూపెట్టి ఈ సరికొత్త సాంకేతిక విజ్ఞాన శాస్త్రాలకి వెలుగుబాట వేసేడు. 20వ శతాబ్దంలో అవి ఊపిరి సలపనంత వేగంగా అభివృద్ధి చెందేయి. తన క్వాంటమ్ సిద్ధాంతం ఇంతటి అనూహ్యమైన నూతన పరిణామాలకి దారితీస్తుందనీ, గణిత, భౌతిక, రాసాయనిక, ఖగోళశాస్త్రాలు శాఖోపశాఖలుగా విస్తరిస్తాయనీ తన సిద్ధాంతానికి ఇంతటి విస్తృత పరిధి ఉందనీ ప్లాంక్‌కి ఆనాడు తెలియనే తెలియదు!

# బౌద్ధంలో భౌతికవాదం కోసం విఫలాన్వేషణ

- అశోక్

లేని సృష్టికర్తను ఊహించుకొని అతని అనుగ్రహం కోసం చేసే ప్రార్థనలు, మతపరమైన కర్మకాండలు పూర్తిగా నిష్ప్రయోజనకరమైనవని బౌద్ధం స్పష్టం చేసింది. నైతికప్రవర్తన ద్వారా, ధ్యానం ద్వారా మాత్రమే మానవుడు కర్మప్రేరితమై సాగుతున్న పునర్భవ చక్రాన్ని అధిగమించి నిర్వాణాన్ని పొందగలుగుతాడని చాటి చెప్పటం ద్వారా అది నైతికతకు పెద్దపీటవేసింది. కానీ బౌద్ధంలో నైతికవాదానికి బదులు భౌతికవాదాన్ని కనిపెట్టడానికి చాలాకాలంగా అన్వేషణ సాగుతూనే ఉంది. ఇటీవల ప్రచురితమైన బౌద్ధం అంటే ఏమిటి? అనే అనువాద గ్రంథంలో కూడా ఇలాంటి ప్రయత్నమే కన్పిస్తుంది. ఎనభై ఏండ్ల క్రితం బౌద్ధపండితుడు, కులనిర్మూలనవాది ప్రొఫెసర్.పి. లక్ష్మీనరసు ''వాటీజ్ బుద్ధిజం'' అనే పేరుతో రచించిన ఆంగ్లగ్రంథాన్ని కీ.శే. ఏటుకూరు బలరామమూర్తి ''బౌద్ధం అంటే ఏమిటి?'' అనే పేరుతో తెలుగులోకి అనువదించారు. బలరామమూర్తిగారు ప్రముఖకమ్యూనిస్టు మేధావి. ఆయనఎంతోమంది కమ్యూనిస్టు కార్యకర్తలకు రాజకీయపాఠశాలల్లో మార్క్సిస్టు తత్వశాస్త్రాన్ని తమదైన ప్రత్యేక శైలిలో బోధించారు.

''బలరామమూర్తి బౌద్ధాన్నిగతితార్కికదృష్టిగా, అంటేఘటనలలోని అంతర్గతవైరుధ్యాల కారణంగా మార్పు జరుగుతుందనే నిత్యనూతన వాదాన్ని గౌతమబుద్ధుడు ప్రవచించాడని తమరచనల ద్వారా నిరూపించారు''

''ప్రొఫెసర్ లక్ష్మీనరసుపై మార్క్స్, ఎంగెల్స్‌ల ప్రభావం లేకపోయినా, ఆయన బౌద్ధంలోని గతితార్కిక, భౌతిక వాద దృష్టిని తమ రచనల్లో బాగా విశ్లేషించారని బలరామమూర్తి అభిప్రాయపడ్డారు. అందువల్లే లక్ష్మీనర్సు రచనలపట్ల ఎంతో ఆసక్తి కనబరచి, ఆయన రచనల్ని తెలుగుపాఠకులకు అందించాలని తహతహలాడారు''

అని ఈ అనువాదగ్రంథ ప్రచురణకర్త టి. రవిచంద్‌గారు తమముందు మాటలో చెప్పారు. కానీ ప్రొఫెసర్ లక్ష్మీనరసుగారి ''వాటీజ్ బుద్ధిజం''లో ఎక్కడా భౌతికవాద మేకాదు, దాని ఛాయలు కూడా లేవు. బౌద్ధాన్ని ఏ ఇతర తాత్విక దృక్కోణాల నుంచి కాకుండా ఉన్నది ఉన్నట్లుగా పరిశీలించి ఎంతో సూటిగా, సరళంగా, తమ చిన్న గ్రంథంలో వివరించారు ప్రొఫెసర్ లక్ష్మీనరసు. అందుకే ఆయనగ్రంథం ప్రపంచవ్యాప్తంగా బౌద్ధులను, బౌద్ధేతరులను కూడా బాగా ఆకట్టుకుంది. డాక్టర్ అంబేద్కర్ లాంటి మేధావిని, సాంఘికసమతావాదిని కూడా ప్రభావితం చేసింది.

బలరామమూర్తిగారి అనువాదం మాత్రం మూలానికి భిన్నంగా సాగింది. కొన్ని చోట్ల మూలంలో ఉన్న భౌతికవాద వ్యతిరేకఅంశాలను అనువదించకుండా వదిలేశారు. మరికొన్నిచోట్ల మూలంలో లేని భావాలను చొప్పించారుకూడా. బలరామమూర్తిగారు మూలగ్రంథాన్ని భౌతికవాద దృక్కోణంతోనే పరిశీలించారు కాబట్టి వారికి అందులో లేని అర్థాలు గోచరించి ఉండవచ్చు.

కర్మసిద్ధాంతం, పునర్జన్మ బౌద్ధంలో ప్రధానమైన అంతర్భాగాలు. బుద్ధునికంటే ముందే వైదికమతంలోనే ఈ రెండు భావనలున్నా బుద్ధుడు వాటిని తిరస్కరించకుండా అనాత్మసిద్ధాంతం ప్రాతిపదిక మీద వాటికి నూతన వ్యాఖ్యానం చెప్పాడు. రూపం, వేదన, సంజ్ఞ, సంస్కారం, విజ్ఞానం అనే ఐదు స్కంధాల సమాహారమే వ్యక్తి. ఇందులో రూప స్కంధమంటే శరీరం. మిగిలిన నాలుగు స్కంధాలను కలిపి మనసు లేదా నామం అని వ్యవహరిస్తాం. ''తిరిగి జన్మించేది

ఆత్మకాదు నామరూప సముదాయం (మనసు, శరీరం) మాత్రమే. అసలు శాశ్వతమైన ఆత్మ అంటూ ఏదీలేదు.'' అని బౌద్ధంనొక్కి చెప్పింది. కానీ బలరామమూర్తిగారు తమ అనువాదంలో బౌద్ధం పునర్జన్మనే తిరస్కరించిందని చెప్పడానికి ప్రయత్నించారు. లక్ష్మీనరసుగారు తమ 'వాటీజ్ బుద్ధిజం' లో ఇలారాశారు.

"Individual death is the penalty that man pays for his high degree of individuation. It is the lives that die but not life. Though nature uses up individual lives just as fire burns up fuel, yet these lives are not past and gone. (గరిష్ఠవైయక్తీకరణ చెందినందుకు గాను మనిషి చెల్లించే పరిహారమే వైయక్తిక మరణం. జీవితాలు నశిస్తాయి. కానీ జీవం నశించదు. వంట చెరుకును అగ్నికాల్చినట్లే ప్రకృతి వైయక్తిక జీవితాలను వాడుకొని నశింప జేస్తుంది. కానీ ఈ జీవితాలు అంతటితో పూర్తిగా అంతం కావు.)

ఈ భాగాన్ని బలరామమూర్తి ఇలా అనువదించారు.

''వ్యక్తికి మరణం, వైయక్తిక ఔన్నత్యాన్ని సాధించాలనే వ్యక్తికి మరణం. జీవులు నశిస్తాయి. జీవితం నశించదు. వంటచెరుకును అగ్నికాల్చినట్లే వ్యక్తిగతజీవితాలు నశిస్తాయి. జీవితం అంతటితో (సామూహిక అర్థంలో) అంతంకాదు.''

మరణానంతరం కూడా జీవితాలు కొనసాగుతాయనే భావనను ఆమోదించలేని బలరామమూర్తి గారు మూలంలో లేకపోయినా ''సామూహిక అర్థంలో'' అనే పదాలను బ్రాకెట్లమధ్యలో చేర్చారు.

He that has no clear idea of death and does not master the fact that death everywhere consists in the dissolution of the skandhas comes to a variety of conclusions such as 'a living entity dies and transmigrates into another body'; and similarly, he that has no clear idea of rebirth and does not master the fact that the appearance of the skandhas everywhere constitutes birth, comes to a variety of conclusions such as 'a living entity is born and has obtained a new body'. There is not a being that is born, or acts and enjoys itself, or suffers and dies, or is reborn to die again, but simply birth, action, enjoyment, suffering and death take place. The life activities, thoughts, words, deeds alone are real, and these are preserved and nothing else. (మరణంగురించి స్పష్టమైన-అవగాహన లేనివారు, స్కంధాలునశించటమే మరణమనే వాస్తవం తెలియనివాడు, సజీవతత్వమేదో మరణించి మరోశరీరంలోకి తరలివెళ్లడం లాంటి రకరకాలైన అభిప్రాయాలు ఏర్పరచుకుంటాడు. అలాగే పునర్జన్మగురించి స్పష్టమైన అవగాహన లేనివాడు, స్కంధాలు తిరిగీ ఏర్పడడమే పుట్టుక అనితెలియని వాడు సజీవతత్వమేదో జన్మించి కొత్తశరీరాన్ని ధరించిందని భావిస్తాడు. జన్మించి, వివిధ కార్యకలాపాలునిర్వహించి, కష్టసుఖాలు అనుభవించి, మరణించి, తిరగీజన్మించి, తిరిగీ మరణించే జీవి అంటూ ఏదీలేదు. కేవలం జన్మ, కార్యకలాపాలు, సుఖదుఃఖాలు, మరణం సంభవిస్తుంటాయి. జీవన కార్యకలాపాలు, ఆలోచనలు, మాటలు, చేతలు, మాత్రమే నిజం. ఇవి మాత్రమే నిక్షిప్తమౌతాయి. మరేవీ కాదు.)

ఈభాగానికి బలరామమూర్తిగారి అనువాదం:

''పంచస్కంధాలు నశించడమే మరణం అని గ్రహించనివాడు అనేకమైన ఊహలు చేస్తాడు.

ఆత్మమరొక శరీరంలోకి ప్రవేశిస్తుందంటాడు. పంచస్కంధాలు తిరిగి ఏర్పడితే పుట్టుక ఏర్పడుతుంది. ఈ అంశం గుర్తించని వాడే, పైవిధమైన ఆత్మమార్పిడి భ్రమకు లోనవుతాడు. జీవించి, సుఖపడి, బాధపడి, మరణించేవ్యక్తి వేరే ఎవరో ఉన్నాడు అనుకోవడం భ్రమ. ఉన్నదల్లా పుట్టుక, కర్మ, సుఖం, దుఃఖం, మరణం - ఈ చర్యలు మాత్రమే. ఈ చర్యలు వాస్తవమైనవి. అయితే తాత్కాలికమైనవి. శాశ్వతమైనవి కావు. ఇదే కర్మ ఇదే పంచస్కంధాలభావన''

''పునర్జన్మగురించి స్పష్టమైన అవగాహన లేనివాడు'' అన్న మాటలు తమ అనువాదంలో రాకుండా జాగ్రత్తపడ్డారు అనువాదకులు. ఆలోచనలు, మాటలు, చేతలు నశించకుండా నిక్షిప్తమౌతాయి అన్నభావన మూలంలో ఉంది. కానీ అను వాదంలో మాత్రం ఈ చర్యలు తాత్కాలికమైనవి. శాశ్వతమైనవి కావు అని మూలానికి పూర్తిగా భిన్నమైన భావం కన్పిస్తుంది.

As Buddhaghosha says in his Visuddhimagga ""Those skandhas which came into being in the past existence in dependence on Karma, perished then and there. But in dependence on the Karma of that existence other skandhas have come into being in this existence. Not a single element of being has come into this existence from a previous one. The skandhas which have come into being in this existence in dependence on karma will perish, and others will come into being in the next existence, but not a single element of being will go from this existence into the next.

(విశుద్ధిమగ్గలో బుద్ధఘోషుడు ఇలా అంటాడు: ''కర్మమీద ఆధారపడిగతజన్మలో అస్తిత్వంలోకి వచ్చిన స్కంధాలు అప్పుడే అక్కడే నశించాయి. అయితే ఆజన్మలో చేసిన కర్మమీద ఆధారపడి ఈ జన్మలో వేరే స్కంధాలు ఏర్పడ్డాయి. గతజన్మనుంచి ఈ జన్మలోకి అస్తిత్వానికి సంబంధించిన ఏ అంశమూ బదిలీకాలేదు. కర్మమీద ఆధారపడి ఈ జన్మలో అస్తిత్వంపొందిన స్కంధాలు నశించిపోతాయి. వచ్చేజన్మలో వేరేస్కంధాలు ఏర్పడుతాయి. అంతేకానీ ఈ జన్మనుంచి భవిష్యత్ జన్మలోకి తరలివేళ్లే అంశమేదీలేదు.'')

ఈ భాగానికి బలరామమూర్తిగారి ఈ క్రింది అనువాదం పూర్తిగా వ్యతిరేకార్థాన్ని ఇచ్చేలా ఉంది:

విశుద్ధిమగ్గలో బుద్ధఘోషుడు ఇలా అంటాడు:

''కర్మఫలితంగా పంచస్కంధాలు ఏర్పడతాయి. గతజన్మలోని పంచస్కంధాలు నశిస్తాయి. తిరిగిరావు. పాతకర్మఅంతటితో సరి. పంచస్కంధాలు తిరిగి ఏర్పడతాయి. కొత్త కర్మ, చర్య, ఆచరణ తిరిగి ఏర్పడతాయి. కర్మభావన కొనసాగుతూనే ఉంటుంది. పాతకర్మనశిస్తుంది. కొత్తకర్మవస్తుంది.''

పాత కర్మ అంతటితో సరి...అనే భావనను అనువాదకులు ఎక్కడనుంచి గ్రహించారో అర్థంకావడంలేదు. స్కంధాలు నశిస్తాయి. కానీ కర్మనశించదు. ఆకర్మ ఫలితంగానేకొత్త స్కంధాలు తిరిగి ఏర్పడతాయి అన్నది మూలంలోని భావం కాగా కర్మేనశిస్తుందని తీర్మానించారు అనువాదకులు!

ఇంతటితో ఆగకుండా బలరామమూర్తిగారు ''పునర్జన్మలేదు'' అనే శీర్షికను తమ అనువాదగ్రంథంలో చేర్చారు. మూలంలో అలాంటి శీర్షిక అసలేలేదు. పాఠకుల సౌలభ్యంకోసం శీర్షికలు, ఉపశీర్షికలు చేర్చడంలో తప్పేమీలేదు. కానీ మూలంలో చెప్పిన విషయాలకు పూర్తిగా భిన్నమైన శీర్షికను అనువాదకులు ఎంపికచేసుకోడానికి బహుశా వారి గతితార్కిక భౌతికవాద (మార్క్సిస్టు) దృక్పథం కారణమై ఉండవచ్చు.

The mango that is planted rots in the ground, but it is reborn in the

mangoes of the tree that grows from its seed. From the seed to the fruit these is no transmigration of a mango soul, but there is a reconstruction of its form and the type in all its individual features is preserved in the new mangoes. Thus man reincarnates, though there is no transmigration. (మామిడి పండును భూమిలో పాతినప్పుడు అదిలోపలే నశిస్తుంది. అయితే దానివిత్తనం నుంచి పెరిగిన మామిడి చెట్టు పండ్లలో అది తిరిగీ జన్మిస్తుంది. ఆ విత్తనంనుంచి పండ్లలోకి ఏ ఆత్మాతరలివెళ్లడంలేదు. కానీ దాని రూపం మాత్రం పునర్నిర్మితమౌతుంది. దాని ప్రత్యేక లక్షణాలన్నీ కొత్తగా కాసిన పండ్లలో నిక్షిప్తమౌతున్నాయి. అలాగే తరలివెళ్లే ఆత్మలేకపోయినా మనిషి తిరిగి జన్మిస్తాడు.)

ఈ భాగం అనువాదం కూడా మూలానికి విధేయంగాలేదు:

''మామిడి పండు భూమిలోనాటితే, అది నశిస్తుంది. కాని మొక్క-పుట్టి చెట్టుతయారై మరిన్ని మామిడిపండ్లు వస్తాయి. మొక్క-నుండి మామిడికి ఆత్మమార్పిడి అంటూ ఏదిజరగలేదు. అదొక కర్మబంధనం. కార్యకారణఫలితం. పాతమామిడి పండు లక్షణాలు కొత్తగా ఏర్పడిన మామిడి పండ్లలోనూ వుంటాయి. అంత మాత్రాన అదిపునర్జన్మ, ఆత్మమార్పిడి కాదు.''

మనిషి తిరిగిజన్మిస్తాడు...అని మూలంలో ఉంటే అది పునర్జన్మకాదు అని తమ సొంత అభిప్రాయాలను అనువాదకులు ప్రకటించారు.

"What is reborn is name and form".... ఈ వాక్యాన్ని తిరిగి జన్మించేది రూపం, ఆకారం మాత్రమే అని అనువదించారు. name and form అనే పదాలు వచ్చిన ప్రతిచోటా నామరూపాలు(మనసు, శరీరం) అనడానిక బదులు రూపం, ఆకారం అని అనువదించడం ద్వారా మనసును పూర్తిగా రంగంనుంచి తప్పించి భౌతిక శరీరానికే ప్రముఖస్థానమిచ్చారు.

''వ్యర్థకుతూహలం'' అనే వింత ఉపశీర్షికను గ్రంథంలోకి ప్రవేశపెట్టిన అనువాదకులు తెలియని విషయాలను తెలుసుకోవాలనే కుతూహలాన్ని బుద్ధుడు ప్రోత్సహించలేదు అని ప్రకటించారు. Buddhism does not lean for its support on the glamour of the unintelligible. (దురవగాహమైన విషయాల పట్ల ప్రజల కున్న ఆకర్షణ మీద బౌద్ధం ఎన్నడూ ఆధారపడలేదు) - ఇదీ మూలంలోని భావం.

"The deeper one reflects and meditates upon this body...suffering perishes with it" ( ఈ శరీరాన్ని నిశితంగా పరిశీలించి దాని గురించి ధ్యానించే కొద్దీ అది నిరర్థకమైందిగాగోచరిస్తుంది. నిజానికి అందులోంచే దుఃఖం జనిస్తుంది. అందులోనే అదికొనసాగి, నశిస్తుంది. శరీరంలోంచి జనించేదీ దానితో పాటే నశించేదీ దుఃఖం తప్ప మరేదీ కాదు) ఈభాగాన్ని ఎందుకనో బలరామమూర్తిగారు అనువదించలేదు.

శరీరంలోని 32వివిధ భాగాల మీద చేసే ధ్యానాన్ని 'కాయగత సతి' అంటారు, ఈ ధ్యానం శరీరం మీద మమకారాన్ని నశింపజేస్తుందని బౌద్ధుల విశ్వాసం. ఈ ధ్యానం ఫలితంగానే బుద్ధుని కాలంలో చాలామంది భిక్షువులు అర్హత్వంసాధించుకొన్నారని అంటారు. అయినా భౌతికవాదానికి భిన్నంగా ఉన్నందువల్ల కాబోలు ఈ ధ్యానానికి సంబంధించిన వాక్యాలు తర్జుమాకు నోచుకోలేకపోయాయి.

As the Buddhist reformer Lo-tsu says the sound of running water, the rustle of the leaves as the wind plays through them, the movement of the clouds in the sky, and the manifold life and activity of the creatures of the

jungle constitute a great chant; they are so many hymns of praise to the great truths embodied by the life of the great teacher (సెలయేటి గలగలలు, ఆకులతో చిరుగాలి ఆటాడుకొనే సవ్వడి, విశాలగగనంలో మేఘాల సంచారం, వన్యప్రాణాల బహుముఖ జీవన కార్యకలాపాలు - ఇవన్నీ ఆ మహోపాధ్యాయుని జీవితంలో మూర్తిమంతమైన మహాసత్యాలను కీర్తించే స్తోత్రగీతాలు.) ఈభాగాన్ని ''జలప్రవాహంలోని ధ్వని, వాయుకంపనద్వారా చలించే ఆకులరొద, ఆకాశంలో మేఘసంచారం, అరణ్యంలో అసంఖ్యాక జీవుల బహుముఖమైన కార్యకలాపాలు, జీవితవైవిధ్యం - వీనిని దర్శించడమే నిరంతరప్రార్థన. బుద్ధుని జీవితంలో ఈ పరమసత్యాలను, జీవిత కార్యాచరణను ప్రశంసించే అనేకసూక్తులున్నాయి'' అని అనువదించారు.

"వీనిని దర్శించడమే నిరంతర ప్రార్థన' అనే కొత్తభావాన్ని అనువాదకులు గ్రంథంలో చేర్చారు. బుద్ధుని జీవితంలో ఈ పరమసత్యాలను ప్రశంసించే సూక్తులున్నాయని చెప్పడం కూడా మూలంలో లేని విషయమే.

''ఆధునిక వైద్యవిజ్ఞానం, మద్యపాన దుష్ఫలితాలను స్పష్టంగా పేర్కొంటున్నది. దురభ్యాసాలను, మత్తుమందులను, విషపదార్థాల వాడుకను అది ప్రోత్సహిస్తుంది'' ఇక్కడ కూడా అనువాదంలో స్పష్టత లోపించడమే కాకుండా మూలానికి భిన్నమైన అర్థంవచ్చేలా ఉంది.

"As far as we are able to penetrate into prehistonic times, man has been found to be a gregarious being" అన్నభాగాన్ని ''చరిత్రకాలగర్భంలోకి వెళితే, మానవుడు కేవలం స్వార్థపరుడుగా నాడు జీవించే వాడు.'' అని అనువదించారు. gregarious being అంటే గుంపులుగా, తెగలుగా కలిసి జీవించే స్వభావంగల జీవి అని అర్థం.

"Were all sexual intercourse in its very nature an obstacle to the higher life, it ought not to have been possible for Siddhartha to attain Bodhi"( సంభోగం దాని స్వభావరీత్యానే ఉన్నత జీవితానికి అవరోధమయ్యేటట్లయితే సిద్దార్థుడు బోధిని సాధించ గలిగే వాడే కాదు)

ఈ భాగాన్ని బలరామమూర్తిగారు ''లైంగిక జీవితం తప్పనిసరిగా ఉన్నత జీవితానికి ఆటంకం కాదు. అదే నిజమైతే అసలు సిద్ధార్థుడే జన్మించి ఉండేవాడు కాదు గదా'' అని అనువదించారు.

'నివృత్తి-ప్రవృత్తి' అనే అధ్యాయంలో Buddhas (బుద్ధులు) అని ఉన్న ప్రతిచోట బుద్ధుడు అనికానీ బౌద్ధులు అని కానీ అనువదించారు. గౌతమ బుద్ధుడొకడే బుద్ధుడుకాదనీ ఆయనకంటేముందు ఎందరో బుద్ధులుద్భవించారనీ తరువాత మరెందరో ఉద్భవిస్తారనీ బౌద్ధుల విశ్వాసం. కానీ అనువాదకులు ఈ విశ్వాసాన్ని ఆమోదించినట్లు లేదు. 'అవ్యక్తం-వ్యక్తం' అన్న అధ్యాయంలో "The world process did not come into existence all perfected" అన్న వాక్యాన్ని ''ఈ ప్రపంచం పరహితంగా ఆవిర్భవించ లేదు''. అని అనువదించారు. దీని భావమేమిటో బోధపడడంలేదు.

"There was neither a world nor life nor mind nor a self" అన్న వాక్యభాగాన్ని ''జీవం, మనస్సు, ఆత్మ ఏవీ ప్రారంభంలో లేవు'' అని అనువదించారు. అసలు ప్రపంచమేలేదన్న భావం భౌతిక వాద దృష్టికి వ్యతిరేకంగా ఉందని బలరామమూర్తిగారు భావించారేమో!

''దేవతల దయ వలన పుట్టిన పతితుడు కాదు మానవుడు''

''మానవుడు ఒక 'దయ్యం' లాంటి వాడు''

లాంటి వింత అనువాదాలు ఈ అధ్యాయంలో అక్కడక్కడా కన్పిస్తాయి.

''పరిణామక్రమంలో అనివార్యత, యాదృచ్ఛికత ఫలితంగా ఏర్పడిన వ్యక్తి'' - ఈ వాక్యం బలరామమూర్తిగారి గతితార్కిక భౌతిక వాద దృష్టినుంచి అవిర్భవించింది తప్పితే మూలం లో ఎక్కడా లేదు. "The oridinary man believes in the existence, on the one hand, of real things outside consciousness producing sense impressions, and on the other side of an internal "I" which has these sense impressions. The "Thing"and the "I" are both inferences and are not originally given" (చైతన్యానికివెలుపల వాస్తవ వస్తువులేవో ఉన్నాయనీ అవి ఇంద్రియాను భూతులను కల్గిస్తున్నాయనీ వాటిని అంతర్గతంగా ఉన్న ''అహం'' లేదా '' ఆత్మ'' గ్రహిస్తోందనీ మనం భావిస్తాం. కానీ నిజానికి వస్తువు, అహం రెండూ కూడా భావ సంజనితాలే కానీ సహజసిద్ధమైనవి కావు)

ప్రొఫెసర్ లక్ష్మీనరసుగారి గతితార్కిక భౌతిక వాద దృష్టిమీద బలరామమూర్తి గారి భ్రమలు తొలగిపోవడానికి పై రెండు వాక్యాలు చాలు. కానీ బలరామమూర్తి గారు "real things" అంటే వాస్తవ వస్తువులని కాకుండా బాహ్యఘటనలని అనువదించారు.

కానీ అదే అధ్యాయంలో మరోచోట ''పదార్థం మన చైతన్యానికి బాహ్యంగా, అతీతంగా ఉంటుందని భావించడం విజ్ఞాన శాస్త్ర దృష్ట్యా కూడా అనవసరం'' అని సరిగ్గా రాశారు. పదార్థం నుంచే చైతన్యం ఆవిర్భవించిందన్న భౌతిక వాదానికి ఇది పూర్తి వ్యతిరేకమైన భావన. అయినా ప్రొ. లక్ష్మీనరసుగారి రచనల్లో గతితార్కిక భౌతికవాద దృష్టి ఉందని బలరామమూర్తిగారు ఎలా భావించారో అర్థం కావడంలేదు. భౌతిక వాదులకు, గతితార్కిక భౌతిక వారులకు (మార్క్సిస్టులకు) సంబంధించినంతవరకు బౌద్ధం మరీచిక లాంటిది. బౌద్ధంలోని నిరీశ్వరవాదం, అనాత్మసిద్ధాంతం భౌతిక వాదులకు ఆశలు కల్పిస్తాయి. తమకు కావలసిందేదో బౌద్ధంలో ఉందన్న భ్రమకు వాళ్లు లోనవుతారు. కానీ సర్వం కర్మనుంచే జనిస్తోందని చెప్పడంద్వారా బౌద్ధం భౌతిక వాదం నుంచి పూర్తిగా వేరుపడింది.

ఏది ఏమైనా బౌద్ధంలో గతితార్కిక భౌతిక వాద భావనలున్నాయని బలరామమూర్తిగారు భావిస్తే సమగ్రపరిశీలన జరిపి తాముకనుగొన్న విషయాలను వివరిస్తూ ఒక స్వతంత్ర గ్రంథమే రాయవలసింది. కానీ ఒక అనువాదగ్రంథాన్ని అందుకు సాధనంగా చేసుకోనడం విచారించ దగ్గవిషయం.

భౌతిక వాదదృష్టికి సంబంధించిన దోషాలే కాకుండా ఇతరత్రాకూడా అనువాదంలో ఎన్నో దోషాలున్నాయి.

'వ్యక్తి - సమాజం' అనే అధ్యాయంలో "If Nirvana is annihilation, it is annihilation through growth" అనే వాక్యాన్ని ''నిర్వాణం అంటే నాశనం. మానసిక అభివృద్ధి ద్వారా అరిషడ్వర్గాలను అధిగమించడం ద్వారా లభించే నాశనం,'' అని అనువదించారు. మూలంలోలేని అరిషడ్వర్గాలను అనువాదంలో చేర్చడమే కాకుండా నిర్వాణం అంటే నాశనమే అని నిర్ణయించారు అనువాదకులు.

అదే అధ్యాయంలో "hope in death" కు మృత్యువును ధైర్యంగా ఎదుర్కొగలగడం అని తమకు తోచిన అర్థం చెప్పారు.

ఇలాంటి దోషాలు ఈ గ్రంథం నిండా కొల్లలుగా కన్పిస్తాయి. మొత్తంమీద బౌద్ధం అంటే ఏమిటో తెలియజెప్పడంలో ఈ అనువాదం పూర్తిగా విఫలం కావడమే కాకుండా బౌద్ధంలో లేని భావనలు, మూలంలో లేని అభిప్రాయాలు కూడా అనువాద గ్రంథంలో కన్పిస్తాయి.

# A Tribute to Dr. Alapati, the Founder Editor of Misimi

## REDISCOVERING ONESELF

**THE HINDU**

"All that we are is the product of what we have thought' - Dammapada.

Crowning his Misimi, a Telugu Magazine, with the saying in which he believed heart and soul, Alapati Ravindranath Chowdhary brought out 79 issues. Misimi is one of those rarest of rare gems in terms of literary value which is difficult to be found in the contemporary scene, however deep one may fathom.

Misimi is not a run of the mill magazine. Before delving into its qualitative value, it would be better if the editor is understood. He was born on November 2, 1922 in Govada village of the erstwhile Tenali Taluk. In his early years of journalistic pursuits, he brought our "Jyothi' and "Rerani'. Famous writers like Chalam, Gopichand and G.V. Krishna Rao contributed stories to "Jyothi'. When he failed as a publisher in Tenali, he came down to Hyderabad and started another printing press "Kala Joythi' and began publishing Misimi from 1990. He became an ardent follower of Buddhism and turned a retionalist. Apart from Buddhism, philosophical streams of the East and West, modern man under the canopy of technology, mythological and historical characters and their influence on our lives, artists and their works, are some of the articles featured in this unique magazine.

It is not often that one comes across quality printing with quality features on quality subjects. Misimi - Lustre, is resplendent. It is a monthly (fortnighty too sometimes) magazine. It is a small and compact one with hardly about 40 Pages. It is grace and beauty that goes into it. It comes with the freshness of a morning dewdrop filled with the fragrance of jasmine. No one can smell it. But it is there. Right from the cover page, usually a famous work of art reproduced, to the last page. Misimi only means rediscovering oneself.

---

*Misimi contains everything that a curious mind wants to know. Not a run of the mill magazine, says K.V.S. Madhav.*

---

Misimi takes a long time to be read. Then, one can never throw it away like other magazines because it is a collector's item with information culled out from the past and present. It is a painstaking effort but the sheer commitment of Ravindranath makes it all look so easy.

The literary magazine contains everything that an inquisitive mind would like to devour. For example, the March 1995 issue contains articles on Pablo Picasso, Kundanlal Saigal, a review of Telugu literature, an article on a literary character and a piece on philosophy. Its September 1994 issue contains articles on Kautila, Kanya Sulkam (of Guruzada Apparao) and Bertrand Russel. Works

of Ravi Verma, Demerla Rama Rao and Vaddadi Papaiah adorned the cover pages. A brief history and the background of such illustrations was given inside.

Alas, he is gone now. The selectivity of the contents was such that it could attract only a sale of about 1,200 copies. But Misimi encouraged new writers always. The February 1996 issue was Ravindranath's swan song.

The six-year-old Misimi has lost the Midas touch of its conceiver. Keeping the magazine at the zenith reached by the dreamer called Ravindranath may not be an easy task. Readers would miss Puranam's Madhuravani in Misimi.

His son, Mr.A. Bapanna (incidentally his daughter is named Misimi), says though people want us to continue publishing Misimi it is becoming increasingly difficult for us. It is not a matter of money. We used to sustain losses on every issue. We do not mind taking the blow provided the quality is restored. But how? Who can guide Misimi to its pristine path like my father did?

A meeting is to be held to discuss the future of Misimi. Ravindranath's family members are planning to hold discussions to bring out special volumes.

Ravindranath claimed once that Misimi would fill the vacuum in Telugu magazine journalism. For me, every reader is an editor of the magazine. Does his dream-Misimi-also follow his footsteps? Probably Ravindranath himself wrote the epitaph when he carried the blurb - no re-birth for this anniversary number - on the cover page sometimes.



"Misimi', the literary magazine, commanding a dedicated band of readers. Despite odds, the magazine is brought out, keeping alive the family tradition.

**THE HINDU, Monday, January 6, 1997**



జాక్విలిన్ బుగులిసి ''రే పయనం''లో
స్టేట్స్‌మన్ సౌజన్యంతో